


# అమృతాంజనం వాడి

## శీఘ్రంగా నివారణ పొందండి

నిరపాయకరంగా గుండె జలుబుకు. సాధారణ జలుబుకు అమోఘంగా గుణాన్నిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. కండనొప్పికి. తలనొప్పికి. బెణుకులకు కూడా అమోఘంగా పనిచేస్తుంది. కొంచెం కొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబానికి కళా నెలల తరబడి వస్తుంది.




అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ళ ప్రసిద్ధిపొందిన నమ్మకమైన గృహ ఔషధం.

అమృతాంజన్ నొప్పులు జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు.

అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు • బొంబాయి • కలకత్తా • ఢిల్లీ

JWT/AM/2837

# పురుషసూక్తం

శ్రీ సోమసుందర్

చీకటి నిశ్శబ్దంగా
నిద్రలోనె తొలగిపోతె
చీకటి కింతగ భయపడి
వాకిళ్లను మూయుటేల?

మూయుటేల ఎద తలుపులు—
మూయుటేల మనోనయన
రక్తారుణ సిక్తద్యుతి—?
శప్తరుచిర నేత్రద్వయి?

నిద్రయేల కూర్మకవచ
భద్రతవలె జీవములకు?
తమోభ్రమర చలత్ చలిత
నాదఝరికి భయమదేల?

భయమదేల తనకు తానె
తొలగెడిదే తిమిరమైన!
కనుక నోహో నరుడా—మేల్
కొనుమా! కొనుమా పూనిక.

మూయకుమా మాయ బ్రతుకు
చీకటి దుప్పటి మునుగున;
వాకిట ఒక వెలుగురేక
పొంచెను; హే! స్వాగతమన.

చెదలుతిన్న మెదడు కన్న
పొదలోపలి పులియె మిన్న
చెఱలకన్న ఝరులకన్న
బరువు కనుల మూత మిన్న.

మనికి కన్న మిత్తి మిన్న
నెత్తిని నిష్క్రియత లున్న;
నీడ కన్న కాడె మిన్న
నిశ్చేతన హృదయమున్న.

కనుక నా హా సాహసీ! హ
సించే రోజున్నదిరా!
మును ముందున కనువిందుల
పున్నమి వెన్నెల పూయును.

బ్రతుకు పొలము పదిలపరచ
అదను చెడని పదును కలుగ
తొలకరి పన్నీటి జల్లు
ఎదురై ఎద నూరడించు!

ముడిచి కొనిన రెక్కల పై
పడెను మంచు సంచితాలు,
దులుపుమురా! తెరచికళ్లు—
తొలగించుము మెదడు దళ్లు;

అజ్ఞానం చీకటిరా—
అన్యాయం చీకటిరా—
అహంకార మదమత్సర
మోహాదులు చీకటిరా!

మది ముంగిట పొంచి విడచి
దొంగ దెబ్బ తీయజూచు
చీకటి మన శత్రువురా—
ఆకలి మన శత్రువురా!

తొలగించుము విలంఘించు
అహంకార ధ్వాంతచయముః
అహరహ యాత్రావలంబి
మిహిర వరుని కనుము సఖా!

కరువు బరువు, వగపు చెరువు,
అరిమూకల అరిష్టాల—
కరినీడల పీడకలల—
తొలగించుము పరంతపా!

---

# అమృతవర్షం

## డాక్టర్ మాదిరాజు రంగారావు

[1]సౌంధ్యరోదసి క్రమ్మికొని
అధివాస్తవిక కవితవలె
మధుర శబ్ద ధారాపాతంతో
ఆశామేఘం కురుస్తున్నది అమృతవర్షం

ఎక్కడో ఆగిపోయింది.
ఇక్కడ తూగిపడింది.
రండి ఇట్లా బయటికి.
గదులువీడి, ఎదలు విప్పి.

ముసలి మొగంవలె
నెరియలుపడ్డ భూమి,
జలబిందు పరిస్పందితమై
పసిపాప నవ్వు మొగమైంది.
జలధారా పరిష్వంగంతో
ముగ్ధ ప్రియా చకితమైంది.

మసృణమై ఆర్ద్రమై సుగంధియై
మారింది పురాభావ రూపం.

ఎన్నిపూలు విరబూచింది నా హృదయం
అనంతకోటి నక్షత్రాలవలె
అన్నీ మాలలుకట్టి గగన దీర్ఘగళంలో
వేయాలని ఉంది రాత్రి.
అన్నీ ప్రోవుచేసి జలధిలోల వృక్షంపై
అమర్చాలనివుంది రాత్రి.

1. అంతశ్చైతన్యస్థితి (Subconscious State) కి ప్రతీక

ఇంతలో మెరపు మెరసి, మరపువచ్చి
సుఖస్వప్నం చెడి, తెలివివచ్చి
ఆహ్వానపత్రంవలె ఎదురైంది
[2]ఉదయతరణి.
పురాభావ వగ్నమైంది మనస్సు.
ఇంకా అమృతవర్షం కురుస్తూనేఉంది.

నడవండి, ఇందులో తడిసిన వారి
మనస్సులు వినిర్మలంగా ప్రకాశిస్తాయి.
తడవండి ఇందులో నడచిన వారి
గమనం చైతన్యవంతంగా ఉంటుంది.

భవిష్యత్తు అందమంతా
ఆశారూపంలోవుంది.
అదీ ఆనందంగా, సౌందర్యమయంగా
ఉండాలనుకోవడం మానవ సహజం.

గతంలో నిదురపోయే
ఓ చెట్లూ! కొండలూ!
ఇంకా నే మరచినవారూ!
ఇలారండి వర్తమానంలోకి
అమృతవర్షంచే పునీతులుకండి.
సృష్టి రహస్యానికి వ్యాఖ్యానాలవండి.

వర్తమానంలేంది భవిష్యత్తు ఎక్కడిది?
విచ్చినకంటికి కన్పిస్తుంది,
మింటినుండి మంటికి పాగిన
అరుణ కిరణ కాంతి చక్రం.
మేల్కొన్న మనస్సు అనుభవిస్తుంది,
వర్షామధునాదరూపంలో
ఆశామేఘం కురుస్తున్న
అమృతవర్షం!

2. జ్ఞానానికి ప్రతీక

# తిరుపతి కవుల సాహిత్య సమీక్ష

శ్రీ నిడుదవోలు వెంకటరావు

బుద్ధ చరిత్రమును, సరస్వతీ సంపుటములను చేతఁబట్టుకొని కంటిజోటితో ముందునకుఁ బోవుచున్న యీ భాషాపోషక తేజ మే బ్రాహ్మణప్రభునిదో పరిశీలించితిరా" అన్న [1]పానుగంటి వారిసూక్తికి లక్ష్యమైన పోలవరము జమీందారు శ్రీ కొచ్చెర్లకోట రామచంద్ర వెంకట కృష్ణగారు (1871—1919) ఆంధ్ర మహా పురుషులలో నొకరు. వీరు పట్టభద్రులైన భాషాపోషకులేకాదు—ప్రశస్త రచయితలు. క్రీ. శ. 1896 లోనే, "ఆంధ్ర భాషాభివృద్ధి" అనే వాఙ్మయ చారిత్రకోపన్యాసాన్ని "చింతామణి"[2] పత్రికలో ప్రకటించారు. స్వకీయమైన "సరస్వతి" పత్రికలో కల్హణుని 'రాజతరంగిణి' వచనముగా రచించి రెండు భాగాలుగా ప్రచురించారు. ఈ రచన క్రీ. శ. 1900 లకు ముందే జరిగినట్లు, వారు కృతిపొందిన బుద్ధచరిత్రములో ఈ క్రింది ఆశ్వాసాంత పద్య పాదము తెలుపుచున్నది.

"రాజతరంగిణీ ప్రముఖ రమ్యతరాంధ్ర
వచఃప్రబంధ కర్తా!
జయశీల"[1].

ఇందలి వచన రచన నిర్దుష్టంగాను మనోహరంగాను ఉంటుంది.

ఈ రెండేకాక, 'అపవాద తరంగిణి' అనే ఆంగ్ల భాషా నాటకాంధ్రీకరణాన్ని, మిల్లరు దొర వారి జీవితమనే గ్రంథాన్ని రచించారు.

వీరి యాస్థానములో తిరుపతి శాస్త్రిగారు పదునెనిమిది సంవత్సరములుండి అనేక ప్రాచీన కావ్యాలను పరిష్కరించడమేగాక తమ గ్రంథములను వీరి 'సరస్వతి' పత్రికలో[3] మూలమున ప్రకటించిరి. తిరుపతి వెంకట కవుల గ్రంథాలు దేశములో నింతగా వ్యాప్తి యగుటకు గారణము వారి ప్రతిభ మాట యటుండగా, పోలవరము జమీందారుగారి పోషణమే అనుట సత్యోక్తియేగాని అతిశయోక్తి కాదు. వారు గ్రంథ రచనకు శ్రీకారము చుట్టినది ఈ ప్రభువు గౌరవాదరాల వల్లనే. ఈయనకు సంబంధించి, ఈనాటి వారికి తెలియని, తిరుపతి వెంకట కవుల తెలుగు రచనలను రెండింటిని గూర్చి ముందు తెలుపుచున్నాను. ప్రస్తుత సమీక్షలో పై వివరాలులేవు.

### [4]కర్పూరమంజరి (సట్టకము)

మహాకవి రాజశేఖరుని 'కర్పూర మంజరి'ని తిరుపతి వేంకటకవు లాంధ్రీకరించినట్లుగా వా గ్రంథమందలి యీ క్రింది యవతారిక తెలుపు చున్నది.

---

1. ఆంధ్ర సాహిత్య పరిషదైకాదశ వార్షికోత్సవసభాధ్యక్షోపన్యాసము, పిఠాపురము. 1921.

2. ఈపత్రికాధిపతులు. కందుకూరి వీరేశలింగం పంతులుగారు. (1892—1900).

3. ఇది క్రీ.శ. 1898—1912వఱకు పదిహేనేండ్లు నడచినది. ఇందు ప్రశస్తములైన ప్రాచీనకావ్యాలెన్నో ముద్రితము లైనవి. ఆంధ్ర సాహిత్య చరిత్రలో ఈ పత్రికకొక విశిష్ట స్థానము ఉన్నది.

4. అముద్రిత రచనలు. భారతి, డిసెంబరు 1961. పుటలు 90—92.

శ్రీ మత్పుర దేవతాయై నమః

కవిరాజ రసనాగ్ర కమనీయమైన ప
ల్కులవెలందుక శుభం బొలయుగాత
భారత ప్రముఖ ప్రబంధ నిర్మాతలు
వ్యాసాదులకును మేలగును గాత
లాతి కబ్బపు దొర ల్నవరసంబులకును
గుదురైన పల్కు పల్కుదురు గాత
పరువైన మాగధీభాష పాంచాలికా
రీతితో మాకు స్ఫురించు గాత

గద్య పద్య ప్రబంధ వాక్కల్పనంబు
తెలిసి తెలుపంగ నేర్చిన ధీరు లెల్ల
రాత్రి వెన్నెలలను చకోరములపగిది
బొదలు సత్కావ్యరసము గ్రోలుదురుగాక

పారి:— బావా! యెందులకు బిలిచితివి తెలుపుము

సూత్ర:— ఏమి, ఈ గడబిడ జూడనేదియో యొక నాటక మాడదలచిన వారివలె నున్నారు.

పారి:— ఆ! నాటకము కాదు గాని యొక సట్టక మాడదలచితిమి. ప్రవేశ విష్కంభములు లేకుండ నాటికవలెనున్న సట్టక మందురుగదా!

సూత్ర:— అది యేకవి రచించిన సట్టకము?

పారి:— వారి వాడుక పేరేదియో తెలిసి కొనుము.

గోదావరీ పావనోదార తీరద్వ
యీరాజితావనీదారు డనుచు
సంస్కృతాంధ్ర కవిత్వ సారస్య మకరంద
భసలాయితామిత ప్రతిభుఁ డగుచు
హూణభాషోద్ఘస్వ దుల్లంఘనక్రమ
ప్రాప్త బి.ఏ. పట్ట భద్రుఁడనుచు
కరుణాంతరంగ రంగత్కటాక్షచ్ఛటా
పాలితాఖిల పరివారుఁ డనుచు

నెవని మతియింతు రట్టి పోలవర నగర
పాలకుండగు కృష్ణ భూపాల వరుని
యొద్ద విద్వత్కవీంద్రులై యున్నవారు
శతవధానులు రెండు భాషలకుఁ గవులు

సూత్ర:— అరరే! వీరిని తెలిసికొనుటయే యొక దుష్కరమని ప్రశ్నించితివిరా. తిరుపతి వేంకటేశ్వరులే వారు.

పారి:— బావా! తెలిసికొనలేవనుకొంటివి గాని తెలిసి కొంటివి. వారే యీ సట్టకమును రచించిన వారు.

సూత్ర:— వారు రచించిన పెక్కు శ్రవ్యప్రబంధములు జదివితినిగాని దృశ్యప్రబంధములు చూడలేదు. కాని యిది స్వతంత్ర ప్రబంధమా అన్యకవి కర్తృకమునకుఁ దెనుఁగా?

పారి:— ఇది కర్పూరమంజరి యను ప్రాకృత సట్టకమునకుఁ దెనుఁగు. మహేంద్రపాల మహారాజు గారి గురువుగారగు రాజశేఖర మహాకవిది. ఆ మహాకవి రచించిన, బాలరామాయణము, బాలభారతము, కర్పూరమంజరి, విద్ధసాల భంజిక అను నాల్గును నీ తిరుపతి వేంకటేశ్వరులే తెలిగించిరి."

ఇంకను కొంతభాగమున్నది. గ్రంథము పూర్తికాలేదు. ఈ సట్టకాంధ్రీకరణ మసంపూర్ణముగ నున్నను దీనివలన తిరుపతి కవుల సాహిత్య జీవితము నందలి కొన్ని యంశములు వ్యక్తమగు చున్నవి.

1. తిరుపతి వేంకటకవుల ప్రాకృత భాషా పాండిత్యము.

2. ఈ గ్రంథ రచనకు ముందు వారు శ్రవ్య కావ్యములేగాని దృశ్యకావ్యములు రచింపలేదనుట. అనగా వారంతకు ముందు పద్యకావ్యములేగాని నాటకములు వ్రాయలేదనుట స్పష్టము.

3. వారి వ్రాసిన మొదటి దృశ్యకావ్యము కర్పూరమంజరియే.

4. తిరుపతి వెంకటకవులు మహాకవి రాజశేఖరుని నాలుగు నాటక కృతులు కర్పూరమంజరి బాలరామాయణము, బాలభారతము, విద్ధసాలభంజిక సంపూర్ణముగ తెలిగించినట్లు తెలియుచున్నది. కాని వీనిలో [5]బాలరామాయణము మాత్రమే మనకు ముద్రితమై లభ్యమగుచున్నది. తక్కినవి రాలేదు. [6]కర్పూర

5. పోలవరము జమీందారుగారి సరస్వతీ పత్రికలో ప్రథమముగా ముద్రితమైనది. తిరుపతి కవులుతప్ప వేరెవ్వరు దీనిని తెలిగించినట్లు లేదు.

6. దీని నీ తరువాత విద్వాన్ రావూరి వెంకట సుబ్బమ్మగారు సంపూర్ణముగ తెలిగించిరి.

మంజరి అసంపూర్తిగా లభించినది. దీని తరువాతి భాగ మెచ్చటనైన నున్నదేమో? బాలభారతము 7విద్దసాల భంజిక అనలే కన్పడలేదు.

5. ఇందున్న కృష్ణభూపాల ప్రశంస చూచి నచో, తిరుపతి కవులు బుద్ధచరిత్ర కృతి యిచ్చిన కొలదికాలమునకే ఈరచనలుచేసినట్లు మనముగ్రహించ వచ్చును.

6. భాషాంతరీకరణ రచన తరువాతనే స్వతంత్ర నాటకరచన.

సు వ ర్ణ పా త్రి క ము

తిరుపతి వెంకటకవుల తెలుగు రచనలలో ముద్రితమయ్యు లోక విూపఱకెరుగనిది సువర్ణ పాత్రికము అను స్వతంత్ర నాటకము. పేరును బట్టి యిది విప్రనారాయణ చరిత్రమని విజ్ఞు లూహింప గలరు. దీని రచనాకాలము 1911. దీని వివరములు:

నా ం ది

మెలంతలపైఁట చాటు
చనుమిట్టలపై జనసంబుగాంచి, ద
వ్వుల కధరస్థితామృతమున్
పొంగివహింపఁగఁ బెంపుజెంది, న
వ్వులను సుమంబులన్
గలయఁ బూచు మనోభవభూరుహాంబు, కొ
ల్లలుగ ఫలించు పండ్లరుచి
లాగుత యోగుల చిత్తమేనియున్

ధృత వినమ వైజయంతుల దేవదేవి
హృదయమున నొప్పుచున్న వారినీ గృతాంత
శంఖచక్రుల సజ్జన స్వాంతచరుల
విప్రనారాయణులను భావించువాఁడ

సూత్రధారుడు పిలువగా నటి ప్రవేశించి 'ఆర్యపుత్రా! నమస్కారము.' అనును. అ పై వారి సంభాషణ.

సూత్రధారుడు: ఓసే, ప్రస్తుతకార్యమునే మఱచితివా యేమి.

పలువు రసుంగులం ద్విజుల
బందుగులందఱి విందుసేయఁగా
బిలిచి సమస్తవస్తువులు
విస్తరియుందిడి యొక్కడెవ్వడో
పిలిచినఁవాడు రాకునికి
వేచిన యట్లుగ నీ నిమిత్తమై
నలుగురికింబ్రమోదమిడు
నాటక మాఁగితి మోసి ప్రేయసీ!

నటి:—ఆర్యపుత్ర! తమ నియోగము చొప్పుననే యాగ్రంథము వెదకుటకై కొంతకాలము వ్యయపఱుప వలసి వచ్చినది. (గ్రంథము చేతికిచ్చును.)

సూత్ర: (చూచి) ఇది సారంగు తమ్మయ కవి విరచితంబగు విప్రనారాయణ చరిత్రము. ఇది శ్రావ్య ప్రబంధము కావి దృశ్యప్రబంధముకాదు. వచ్చిన వాలుగక్కరములు మఱచిపోయితివాయేమి?

స్త్రీలకు విద్యలు గరపం
బోలదుగా యంచు శుద్ధమోఱకులెందే
నాలాపింపఁగ వారల
యాలాపము లేవియైన నాలించితివో?

నేను దెమ్మన్నది సువర్ణ పాత్రికమను విప్ర నారాయణ చరిత్రే దెలుపు నాటకముగదా! అదియే యిపుడు మనముఁ జూపబోవునది. (చేతిలోని గ్రంథము లోని పుటలు విప్పి) ఒహో! ఇది నూతన ముద్రి తమై క్రొత్త సంస్కారము గాంచియున్నదే! దీనిని సంస్కరించిన వారెవ్వరో? (పై భాగముంజూచి) ఏమి వింత! నేటితో నీ గ్రంథమునకు శాపవిముక్తి కలిగినది.

నటి: ఆర్యపుత్రా! దీనికిం గలిగిన శాపమేమి?

సూత్ర:—శాపమనగా మఱియేమియు లేదు. కచములు కుచములు మున్నగు శృంగారావయములు వర్ణింపబడుటయు, నీతికిని మతమునకు విరుద్ధమగు మహాత్మ్యమును దెల్పుటయు, మొదలగు దోషములు కొన్ని కల్పించి యే మహానుభావుఁడో వైజయంతీ విలాసము మొదలగు కొన్నిగ్రంథములనుఁ గాల సర్ప ముతోబోల్చి చదువరానివని వ్రాసెనో యాతడే దీనికి పునస్సంస్కర్తయట! అమ్మా! గోదావరి! నీ కడుపున నెంతటి చిత్రసంతానము జనించు చున్నదో కదే!

---

7. విద్దసాలభంజిక కీర్తిశేషులు జనమంచి వెంకటరామయ్యగారు తెలిగించియున్నారు. బాలభార తము—వేలూరికరిచే ననూదితము కాలేదు.

చారుతరంబులై మదికి
సంతసముం బొసరింపఁ జాలు శృం
గారరసప్రధానముల
గ్రంథములం గనినంత వారి వ్యా
పారము నింద్య మౌనసుచుఁ
బల్కుదురక్కట! మూర్ఖులెల్ల సం
సారము సేయరో
కచకుచంబుల కేలఁ బరిగ్రహింపరో?
మతమున నీతి యందు
నొకమార్గము గైకొని యన్యమెల్ల గ
ర్హితమని యెంచువారె యుదయించిరి
ము న్నిపుడుద్భవించువా
రితరుల మోసపుచ్చుట కనేక మతంబు
లనేకరీతు ల
ద్భుతముగ మాటిమాటికినిఁ
బూనెడువార లిదేమిచిత్రమో!

నటి:—ఆర్యపుత్ర! కవితారసంబు నందభిరుచిపడి గ్రంథములు చదువు వారొకరు మానుమన్న మానుదురా! ఇక దీనికి శాపవిమోచన మన నేమి ?

సూత్ర:—ఏమాంత్రికుని చేత దీనియందు దోష పిశాచ మావేశింపబడినదో, వాని చేతనే మరల నా పిశాచము వదలింపబడుటయు నా మాంత్రికుని మాయందవిలి యెవ్వరు దీనిం బఠింప మానిరో వారి వలన మరల దీనిం జదువు భాగ్యము పట్టుటయు దీనికి శాపవిమోచనము. కానిమ్మిక నీయప్రస్తుత ప్రశంస ముగింతము. ప్రస్తుతమున కాయత్తపడుము.''

కాని పై సంభాషణ మెంతమాత్రము "అప్రస్తుత" ప్రశంస కాదు. సరికదా దాని వెనుక యీనాటి వారికి తెలియని చరిత్ర ఎంతో ఇమిడి యున్నది. అది ఆ కాలమున నింగ్లీషు ప్రభుత్వము వారు తెలుగు శృంగార గ్రంథాలపై చేసిన నిషేధ శాసనము.

### శృంగార ప్రబంధ ప్రకటన నిషేధము

సువర్ణపాత్రిక రచనకు కొంచెము ముందుగా అనగా క్రీ. శ. 1911 లో ఈ శృంగారప్రబంధ ప్రకటన నిషేధం ప్రారంభమైనది. అప్పటికి ఏభయి యేండ్ల నుంచి, అవిచ్ఛిన్నంగా, ఆంధ్రకావ్య ప్రబంధ ముద్రణలో ఆరితేరిన "శ్రీ వావిళ్ల" సంస్థవారు ప్రకటించిన యీ క్రింది గ్రంథాలను ప్రభుత్వము వారు నిషేధించారు. అంతేకాదు. ఇట్టివి ముద్రించినందుకు ప్రకటన కర్తలపై "అభియోగము"తెచ్చారు.

1. వీథినాటకము—శ్రీనాథుడు
2. వైజయంతీ విలాసము—సారంగుతమ్మయ్య
3. హంసవింశతి—అయ్యలరాజు నారాయణామాత్యుడు.
4. తారాశశాంకవిజయము—శేషము వెంకటపతి.
5. రాధికాసాంత్వనము—ముద్దుపళని
6. బిల్హణీయము—చిత్రకవి సింగరార్యుడు, (పిండిపెద్ది కృష్ణస్వామి పేర నున్నది.)
7. కవిచౌడప్ప శతకము—కవి చౌడప్ప
8. వేణుగోపాల శతకము—రాయభట్టు వీర రాఘవకవి
9. గణికాగుణప్రవర్తన తారావళి—రాచలేటికవి

కాని అప్పట్లో, ఆ సంస్థకు సర్వాధ్యక్షులైన శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులు గారు సామాన్యులు కారు.ఎంతటి వ్యయప్రయాసలకైనా ఓర్చిభాషాసేవయే పరమార్థంగా భావించువారు. మిక్కిలి పట్టుదలగల వారు. వారీ నిషేధాన్ని గూర్చి ప్రభుత్వము వారితో పోరాడ సమకట్టి ఆ కాలమున ప్రసిద్ధ న్యాయవాదులు పేరి నారాయణమూర్తి గారిని తమ పక్షమున న్యాయవాదిగా నెన్నుకొని అభియోగము ప్రతిఘటించారు. ఇది హైకోర్టు వఱకు వెళ్లినది. తుదకు ప్రభుత్వమువారే కొన్నినెలలయిన తర్వాత కొన్ని సంస్కరణలతో నిషేధాన్ని ఉపసంహరించుకున్నారు కాని పూర్తిగా నిషేధం తీసివేయలేదు. మొదటి ఆరింటిలోను కేవలం శృంగార రసప్రధానములైన పద్యాలను కొన్నింటిని తొలగించి అచ్చువేయుటకు అనుజ్ఞ నిచ్చారు. వానిలో ఒకటి వైజయంతీ విలాసము. పై ప్రస్తావనలో ఈ గ్రంథమునకు "కలిగిన శాపము" "శాపవిముక్తి"అనునవి సారంగుతమ్మయ వైజయంతీ విలాసమునకు సంబంధించిన పై విషయములని తెలుసుకోవలెను.

ఇక "ఏ మహానుభావుఁడీ వైజయంతీ విలాసము మొదలైనవి చదువరానివని వ్రాసెనో, ఆతఁడే దీనికి పునస్సంస్కర్త యటః? అమ్మా గోదావరీ! నీ కడుపున నెంత చిత్ర సంతానము జనించుచున్నదో కదే!" అన్న వాక్యాలలోని వ్యక్తిని గూర్చి పాఠకులు తెలిసికోవలసి యున్నది. ఆయన కీర్తిశేషుడు గోటేటి కనకరాజు. ఆ కాలమున ప్రభుత్వమువారి ఆంధ్రభాషాంతరీకరణోద్యోగి.8 రాజమహేంద్రవర నివాసి. కనకరాజు గారు కందుకూరి వారి శిష్యులు. వీరేశలింగముగారు పై చెప్పిన గ్రంథాలలో వైజయంతీ విలాసము, తారా శశాంకము, రాధికా సాంత్వనమును గూర్చి తమ కవుల చరిత్ర మూడోభాగములో "చాలా అవినీతిని బోధించే కావ్యాల"ని తీర్మానించారు. గురువుగారిని పురస్కరించుకొని శిష్యుడు పై మూడు పుస్తకాలలోని భాగాలు విశేషంగాను తక్కిన వానిలోనివి కొంచెము తక్కువగాను ఇంగ్లీషులోనికి భాషాంతరీకరించి ప్రభుత్వము వారికి పంపారు. దానిపై వారు చర్య తీసుకొన్నారు. కాబట్టి నిషేధానికి కారకులువారే. తిరిగి వానిలో కొన్నిపద్యాలను తీసివేసి, వానిని ప్రకటింపవలసినదని అనుజ్ఞ యిచ్చినది వారే.9

క్రీ. శ. 1912 ప్రాంతమున అప్పటి పరిస్థితులనుబట్టి ప్రభుత్వము ఆంక్ష సడలించినను క్రీ.శ. 1927 లో పూర్తిగ యీ నిషేధ శాసనమును ఖాయపరచిరి. ప్రభుత్వమువారు ఖాయపఱచినా శృంగారరస ప్రవాహాన్ని ఎవరాపగలరు? మదరాసులో కీ. శే. గంటి సూర్యనారాయణశాస్త్రులు గారు, శృంగార గ్రంథమాలలో శృంగారాకృతులతో శృంగార కావ్యాలు వెలువరించారు. బందరులో కే. జి. మూర్తిగారు, శృంగార కావ్య గ్రంథమండలిలో ఎన్నో శృంగారకావ్యాలు ముద్రించారు.10 కొక్కోకాది గ్రంథాలు బొమ్మలతో ప్రకటించారు.ఎవ్వరూ అరికట్టలేదు. ఇవన్నీ సాహిత్యంలో స్థాయిత్వాన్ని సంపాదించనవే. ఈ విషయాన్నిగూర్చి ఎంతో వ్రాయవలసి ఉన్నా ప్రస్తుత సందర్భాన్ని బట్టి విరమిస్తున్నాను.

క్రీ. శ. 1947 లో దేశస్వాతంత్ర్యంతో శృంగార నిషేధ శృంఖలాలు విడివడ్డాయి. శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి మూలమున — ప్రకాశంగారి ప్రధాన మంత్రిత్వంలో ఇది జరిగింది.

ఈ సంభాషణయైనవెనుక, తమ కాలమున కవితారచనలలో కనబడుచున్న వ్యర్థపదప్రయోగములను గూర్చి సూత్రధారునిచే నిట్లు పలికించినారు.

ఇల, భువి, భూమి, పృథ్వియని
యెందు నిరర్థక శబ్దముల్ యతి
స్థలములఁ బ్రాసలందును
శతంబులు గూర్చిన పద్యజాలము
న్నలుమరు శ్రద్ధగాఁ జదివినం గమనించిన
నెంత బుద్ధిమం
తులకును వానిలో మఱుఁగుదోసము తప్పదు
మానినీమణీ! 11

తరువాత నాటక రచయితలైన కవులు వారి పోషక ప్రశంస.

ఏవాని యాననం బేవాడు గనుఁగొన్న
మందస్మితప్రభాసుందరంబు
ఏవాని వాక్యంబు లెంతెంత బుధులు నే
దలఁదాల్చజాలు ముత్యాలజాలు
ఎవని గాఢప్రజ్ఞ యేపట్లఁ జూచినఁ
గూలంకషాలోచ నాలయంబు
ఎవని నికేతనం బేవంక నరసినఁ
దతబంధుమిత్రాశ్రితవ్రజంబు
ఎవనిఁ గ్రీగంటి చూపుల నెల్లయపుడు
వరదలై పాఱుచుండు గృపారసంబు
శ్రీకరగుణాకరుండు కొప్పెర్లకోట
వంశచంద్రుఁడీ కృష్ణభూపాలమౌళి

8. Telugu Translator to the Madras Government.

9. ఆనాటి నుండియే యిట్టి గ్రంథాలపై ముఖపత్రమున 'Scholars Edition' అని ముద్రించుట పరిపాటియైనది.

10. వానిలో సత్యభామా సాంత్వనము నా పీఠికతోనే వెలువడినది.

11. ఇట్టి నిరర్థక రచనలనుగూర్చి కావ్యవిమర్శనలో యమునికన్నా నిర్ఘృణుడని పేరు పొందిన కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి గారిట్లా అన్నారట
"తనకు గోష్పాదమంత భూమి లేకపోయినా. తన కావ్యంలో మాత్రం ఎక్కడ చూచినా భూవాచక, పర్యాయపదాలే కనిపిస్తాయి."

ఆ పోలవరపురీభూపాలుని కవీంద్రు
లాబాల్య కలిత సౌహార్ద పరులు
కలలేఖినీపద్యసంధానధౌరేయు
లష్టావధానచర్యాప్రవీణు
లాభాష్యపఠితదివ్యవ్యాకరణతంత్రు
లవిరతకవితారసైకవశ్యు
లఖిలాంధ్రభూపాలకానీతబహుమాను
లర్పిత పరదేవతాంఘ్రియుగులు

వరులు తిరుపతి వేంకటేశ్వరులు తేంట్ల
కొఱకు చైత్రవైశాఖముల్ విరులు సృష్టి
సేయుగతి బుధులకయి రచియించుచున్న
నాటకంబుల లోనిదీ నాటకంబు

రంగనాథ పదాంబుజ భృంగమైన
విప్రనారాయణుని నొక్కవేశ్య వలచి
దాసునిగ జేసి కొన్న కథావిధాన
మిందు వర్ణింపఁగాఁ బడె సుందరమున

వేశ్యారాగము మన్మథ
వశ్యత్వము దొంగతనము వాణిజ్యంబున్
వేశ్యామాతల మాయల
వశ్యముఁ జూపఁలకుఁ దెలియవలసిన విందున్

ఆ పైని సంగీతమును గూర్చి కాముని ప్రభావమును గూర్చి రెండు పద్యాలను ఈ ఆముఖము నుండి ఉదాహరించు చున్నాను.

సంగీతము—

చేతము చల్లజేయుటకు
జేసిన దివ్యరసాయనంబు, శో
భాతిశయంబునంబొగులు
వయ్యలకేనియు వేళవుచ్చు సం
గాతము సార్వకాలిక సుఖస్వము
సేర్చిన గోత వౌర! సం
గీత మిదేకదా యభిముఖీకరణౌషధ
మెల్లవారికిన్

కాముని ప్రభావము—

మగకచ్చంబిగగట్టి చిత్తమెపుడు
న్మత్తంబుగాసీవి మే
విగణంబుం గగనాగచుంబితములై
నీరంధ్రసాలాంతరా
భగతానేకగృహంబులై తనరు
బాలాకేళి సౌధంబులం
దగు పూసెజ్జలఁ జేర్చు నేరుపరి
కందర్పుండు సామాన్యుడే

ప్రథమాంకము వివరనిట్లున్నది.

"ఇది శ్రీ తిరుపతి వెంకటేశ్వర విరచితంబగు సువర్ణపాత్రికమను ప్రకరణంబున బీజారోపణంబను ప్రథమాంకము." దీనినిబట్టి ఇదియొక "ప్రకరణము" అని భావింపవచ్చును. తక్కిన యంకముల సంగతి తెలియరాదు. ఈ అంకమున గల కామ వైరాగ్యముల వివాదము చాలా మనోరమముగానుండును. ఈ ప్రకరణము పూర్తి ప్రతి యెక్కడ దాగి యున్నదో!

## బుద్ధ చరిత్రము

తిరుపతి వెంకటకవుల మొదటి పద్యకావ్యము బుద్ధచరిత్రము. కథాగౌరవముచేతనేకాక, కవితా రచన చేతను, పానుగంటి వారి ప్రశంసకు పాత్రమైన ఈకృతి, పోలవరపు జమిందారు వెంకటకృష్ణారావు గారి కంకితము. కృతికర్తల, కృతిభర్త కీర్తిని చిరస్థాయిచేసిన యీపద్యకృతి,[12] ప్రకటితమైన నాటి నుండి నేటివరకు ప్రఖ్యాతమై నిలిచియున్నది.

## స్వతంత్ర రచన

ప్రస్తుత విమర్శ గ్రంథమున (పుట 102) 5 వ శీర్షికగా "ఆంధ్రీకృత కావ్యములు" అనునది కలదు. వానిలో "శ్రీనివాస విలాసము" తరువాత "బుద్ధచరిత్ర" ఉన్నది.[13] గ్రంథకర్తలీకృతిని గూర్చి యిట్లు వ్రాసియున్నారు.

"ఇద్దతేజుడైన బుద్ధదేవు చరిత్ర
యశ్వఘోషముఖుల ననుసరించి
యస్మదంకితముగ నాంధ్రకావ్యమొనర్పు
డనుచు వీడ్యమిచ్చె నాదరమున"

12. చూడుడు. అముద్రిత గ్రంథచింతామణి పత్రిక - (జనవరి 1903 పుట 19 సంపుటము 16. సంచిక 1)

13. అన్నిచోట్లను "బుద్ధచరిత్రము" అని యుండగా ఇందు 'బుద్ధచరిత్ర' అని మాత్రమే గలదు. (పుట. 111)

అని కృత్యాదియందు తిరుపతి కవులు వ్రాసి కొనిరి. కావున బుద్ధచరిత్ర యొక విధముగా నాంధ్రీకరణమని యంగీకరింపవలయును". కాని యిది యాంధ్రీకరణ మెంతమాత్రమును గాదు. స్వతంత్ర రచనయే. అశ్వఘోషుని బుద్ధచరిత్రకు యథానువాదమగు నాంగ్లభాషా రచనకు చావలి సూర్యప్రకాశరావు బి. ఏ. యల్. టీ. గారు, తెలుగుభాషలో వచనరూపముగా కథా సారమును వ్రాసిరి. తిరుపతి వెంకట కవుల రచన ఆ వచన కథాసారమునకు విపులమైన పద్యాకృతి. కాబట్టి దేనికిని అనువాదము కాదు.[14] ఇందు 'కల్పిత కావ్యము'లను శీర్షిక యున్నదేకాని, "స్వతంత్ర రచనలు" అను శీర్షికయే లేదు. ఇక నిందు విడివిడిపెట్టబడిన అంశాలు వివరిస్తున్నాను.

శ్రీధామంబగు నీలభూధ్రమున
సుస్థిమించు వారాశి పీ
చీధావళ్యమునేలు దేవళమునన్
జెన్నొందు దేవుండు లో
కాధారంబు హలాయుధ ప్రణయి
నిత్యానంది శ్రీమజ్జగ
న్నాథస్వామి కృపాళుఁడై మనుచు
కృష్ణారాయ విద్వత్ప్రభున్.

ఇది బుద్ధ చరితములో మొదటిపద్యం. దీనినే క్రీ. శ. 1914 వ సంవత్సరంలో జరిగిన లక్ష్మీ నరసాపుర శతావధాన సందర్భంలో ఉభయభాషాకవి ద్వివేది నారాయణశాస్త్రిగారు ఎట్లనుకరించారో చూడండి.

శ్రీధామంబగు సింహశైలమున
సుస్థిమించు దుగ్ధాబ్ధిపీ
చీధావళ్యమునేలు దేవళమునన్
జెన్నొందుచున్నట్టి లో
కాధారుండగు శ్రీవరాహనరసింహస్వామి
ధర్మక్రియా
ప్రాధాన్యైస్సితః జెల్లయాంబ కృపతో
రక్షించు నెల్లప్పుడున్.

తిరుపతి కవుల రచనలలో ప్రాచీన కవుల ఛాయలు కనిపిస్తూనే ఉంటాయి. ఈ కృతిలో సరస్వతీ వర్ణన అట్టి ఛాయ గలది.

శతలేఖిన్యవధానపద్యరచనా
సంజాత భాస్వద్యశో
వితతాశేషవరాంధ్రభూపతిసభా
విఖ్యాతనామాస్మదో
గారణమైనదేవి
ఘన వీణాపాణి యువ్వాణి
సంతతమున్ వేంకట కృష్ణరాయ విభు
వాగ్దామంబుఁ గామించుతన్

ఇది చళ్ళగొండ ధర్మనకవి చిత్రభారతము[15] నందలి ఈ క్రింది పద్యాన్ని అనుసరించినది.

శతలేఖిన్యవధానపద్యరచనాసంధా
సురత్రాణ చిహ్నితనామా
చళ్ళగొండ ధర్మసుకవీ!
నీ వాగ్విలాసంబు లా
శితికంఠోజ్జ్వలజూటకోటరకుటీ
శీతాంశురేఖాసుధాన్విత
గంగాకనకాబ్జ నిర్ఝర రసావిర్భూత
మాధుర్యముల్.

పరదేవతాపాదపద్మాంసువులైన తిరుపతి వెంకట కవులు పరాశక్తిని వర్ణించిన పద్యం ఎంతో హృద్యంగా ఉండడమేకాక, వారి ప్రతిభను వ్యక్తీకరించు చున్నది.

నలినాక్ష ప్రభృతుల్ త్రిమూర్తులు గవర్నర్లై
సురల్ క్రింద వర్తిలు
సుద్యోగిజనంబులై
ఘనమణి ద్వీపంబునన్" లండనై"
యలరం దా నొకరాణియై జగము లే
యంబా మహాదేవి వి
చ్చలు బాలించు కృపాబ్ధి యా జనని
కృష్ణరాయు మన్నించుతన్

పై పద్యమున నాకాలమున ఆంగ్లేయ సామ్రాజ్యమునకు చక్రవర్తినియైన విక్టోరియా మహారాణి[16]సూచితమైనది.

---

14. చూడుడు. బుద్ధచరిత్రము ప్రథమ ముద్రణ పీఠిక—పుట. 1. (1902)

15. అవతారిక-ప్రథమాశ్వాసము,26వపద్యము.

16. దీనినిబట్టి బుద్ధ చరిత్రము క్రీ. శ. 1901 లో విక్టోరియా నిర్యాణమునకు ముందే రచితమైనట్లు స్పష్టము.

విక్టోరియాకు పరాశక్తికి అభేదవ్యవసాయము.

| | |
|---|---|
| పరాశక్తి | విక్టోరియారాణి |
| త్రిమూర్తులు | ముగ్గురు గవర్నరులు[17] |
| మణిద్వీపము | లండను[18] |

పరాశక్తికి త్రిమూర్తులవలె కలకత్తా, మదరాసు, బొంబాయి గవర్నరులు విక్టోరియారాణికి, ఆజ్ఞావశవర్తులు.

ఇందొక విశేషమున్నది. ఆ కాలమున భారత వర్షమున కలకత్తా, మదరాసు, బొంబాయి రాష్ట్ర పరిపాలకులు ముగ్గురే గవర్నరులు. తక్కిన సంయుక్తరాష్ట్రము,బీహారుమొదలగు రాష్ట్రపరిపాలకు లందరు లెఫ్టినెంటు గవర్నర్లు. కాబట్టి త్రిమూర్తులతో పోలిక ఎంతో సమంజసముగా నున్నది. మరియు దీని వలన తిరుపతి వెంకటకవుల రాజ్యాంగ పరిజ్ఞానం కూడ వ్యక్తమగుచున్నది.

వారి కావ్యాలలో కవిత్వమును గూర్చి, కవితా రచనను గూర్చి ప్రత్యేకాభిప్రాయాలు ప్రకటించడము ప్రాయికంగా కనబడుతూ ఉంటుంది. ఈ పద్ధతికి బుద్ధచరిత్ర 'పీఠిక'యే దారి చూపినది.

క. అల్లితిమి తోచుగతి కవి
తల్లజులొనరించు గ్రంథతతి కిది సమమా
"ఢిల్లికి ఢిల్లే, పల్లెకు
పల్లే" యని చెప్పునట్టి పల్కులు వినరే!'[19]
[20]అంచితులైన వారలిది
యూరసి యూ రసముం గ్రహించి లా
లించిన జాలు కొందరవిలే వివిలేవని
యెంచు చున్నవారంచు వచింప మానుదుమె?
యందరనుం దనియింప మమ్ము ని
ర్మించిన బ్రహ్మకైన దరమే
యిది పెద్ద లెఱుంగకుందురే.

పలువురు సత్కవిత్వమది
పొల్పడకుండియు కొన్నిపుస్తకం
బులు రచియించి సిగ్గులక
మోదము చెందుట తప్పుకాదు, పు
త్రులు తనకుద్భవించిన కురూపులు గా
గలరంచు భార్యతో
కలయిక మానునే సుతుని
గాంచక యుండునె రూపహీనుడున్

తెలుగులో బౌద్ధవాఙ్మయ ప్రవేశానికి బుద్ధ చరిత్రమే నాంది. ఆ వెనుకనే, బుద్ధుని గూర్చిన చరిత్రలు, అవదాన కల్పలతలు, జాతక కథలు, జాతక కథాగుచ్ఛాలు బుద్ధ[21] బోధసుధ మొదలైన నాటకాలు బయలుదేరాయి. ఇందులో కవితా రచన బౌద్ధమతాన్ని గూర్చి భేదాభిప్రాయాలు కలవారు కూడా చదివి ఆనందింపదగిన ఆకర్షణతో నున్నది. ఇంతేకాదు. తిరుపతి వేంకటకవులు శతావధానులేకాక, కావ్య కర్తలని మొదట నిరూపించినది బుద్ధచరిత్రమే.

## శ్రవణానందము

తిరుపతి వెంకటకవుల కృతులలో సమధిక ప్రచారము గాంచినది శ్రవణానందము. ఇది క్రీ. శ. 1912 నాటికి మూడు ముద్రణలందినది. మూడు నాల్గేళ్లలో వేలకొలది ప్రతులు చెల్లెను. వారి కృతులలో హెచ్చుసారులుముద్రితమైనది శ్రవణానందమే అని చెప్పవచ్చును.(క్రీ.శ.1950కి ఆఱు ముద్రణలు). ఇది శృంగార రస ప్రధానమైన కావ్యము కాబట్టి ఒకప్పుడిది ప్రజానీకాన్ని అతివేగంగా ఆకర్షించినా, ప్రస్తుత కాలానికి సరిపోదు. అంతేకాదు. ఈ కావ్యము కూడా అప్పటి ఆంగ్లేయ ప్రభుత్వమువారి నిషేధము నకు పాత్రమైనది. అయినా సాహిత్య దృష్ట్యా పరిశీ

17. 'గవర్నరు' అను నాంగ్లేయపదమునకు దీనినే నేను శబ్దరత్నాకరమున నుదాహరణముగా నిచ్చియున్నాను.

18. 'లండను'—ఈ పదమునకు, ఇది రెండవ యుదాహరణ. మొదట నిది కొక్కొండవారిచే ప్రయుక్తము.

19. ఈ పద్యాన్ని బుద్ధచరిత్రము విమర్శనలో అముద్రితగ్రంథచింతామణి పత్రికాధిపతు లుదాహరించారు.

20. ఈ పద్యమే, శ్రవణానందమున ప్రథమాశ్వాసము 15వ పద్యముగా నున్నది.

21. తెలుగులో బౌద్ధవాఙ్మయాన్ని గూర్చి పరిశోధన జరగాలి. చూడుడు—బుద్ధజయంతి సంచిక. పరిశోధన పత్రిక 1956.

లించినట్లయితే ఇందులో కొన్ని విశేషాలు గోచరిస్తాయి. ఈ విమర్శన గ్రంథంలో శ్రవణానందాన్ని గూర్చి 15 పుటలున్నా అందులో భాషా సాహిత్య విశేషాలు లేవు. [22] కొన్నిటిని ఉదాహరిస్తున్నాను.

1—52. 'భావిపురాతనాద్యతనపార్థివులం దలపోకాపు.రీ'

ఇది నన్నయ, భావిపురాతనాద్యతన పార్థివ లక్ష్ములు అను పద్యమున కనుకరణము.

1—62. షష్ఠ్యంతములు-షష్ఠ్యంతములు కవులు ఒకటికి మించిన సంఖ్యగా చెప్పినా, తిరుపతి కవులు ఒకే పద్యం చెప్పారు. సాధారణంగా షష్ఠ్యంతాలు కంద పద్యాలతోనే ఉండడము నియమము. అయినా వృత్తాలు కూడా క్వాచిత్కంగా ఉన్నవి. ఈ రెండు పద్ధతులు లేకుండా తిరుపతికవు లొకే సీసపద్యము షష్ఠ్యంతముగా వ్రాశారు. అయితే అందులో పన్నెండు పాదాల చివర షష్ఠీవిభక్తి ప్రయోగించారు. ఇదే యిందులో విశేషం.

1—82. గీ. వయసువాఁడఁట! యామీఁదవైష్ణవుఁడఁట!
సుకవియఁట! సూక్తినిధియఁట! సోయగంబు
గలుగువాఁడఁట! మనములు గఱచుకున్నె
తొత్తికైనను వేలాటి నాతికైన

ఇది—పింగళి సూరన్న కళాపూర్ణోదయములోని యీ క్రింది పద్యాన్ని అనుసరించినది.

గీ. మొదట బలు రేఖగలదఁట! పిదప దాని
వయసు క్రొత్తఁట! వెలయాలి వంగడ మఁట!
వనిత చక్కదనమ్మును వన్నెలాఁడి
తనము జాణతనంబును తరమె పొగడ.

ఇందు నాయికాపరముగా నున్నది పైన నాయకపరముగా నున్నది.

1—113. కవిరాజవిరాజితమునకు నన్నయ ననుసరించి యతి యొక్కటియే వాడబడినది.

"లలిత సువృత్తనిబంధుయుతామితలక్షణ లక్షితచిత్రితకం బల" దీనికి మూడు యతులు తిక్కనాదులు వాడిరి.

2—41. రసికులు గారనుచు మూర్ఖురాలికిఁ జెప్పఁడీ' ఇచట—రాలికి—అనుచో హల్లునకు యతి. లాక్షణికులలో అప్పకవి మాత్రమే—రాలు శబ్దమున—అచ్చునకు హల్లునకు యతి యని నిరూపించినాడు.[23]

4—30. రసుజ్ఞ నరులమంచు విక్కెదరుగా జ్ఞ—క యతి.

5—20. "మనమా! వద్దిక నాదు మాట వినుమా మర్యాద గాపాడుమా, ఈ మకుటాన్ని అందుకొని ఒక ప్రఖ్యాత కవయిత్రి "మానసిక సామ్రాజ్యము" అనే చిన్న కావ్యము రచించారు[24]. ఒక్క పద్యముదాహరిస్తున్నాను.

మ. వినుమా 'మానస రాజహంస' యని
యాపేరన్ విరాజిల్లె దీ
[25]నవు నయుంబొప్పఁగ, క్షీరనీరములదా
నొర్మిన్ మరాళంబు సం
తనతో వేఁొనరించునట్లు భువి
నిత్యానిత్యమూహింపు మో
మనమా! జ్ఞానము నొంది మానసిక
సామ్రాజ్యంబు నీ వొందుమా

ఇంకనూ చూపవలసిన విశేషములెన్నో శ్రవణానందమున గలవు.

[26]బిడాలోపాఖ్యానము

ప్రస్తుత గ్రంథకర్తలీ బిడాలోపాఖ్యానమును, తిరుపతి వెంకటకవుల రచనగా భావించి, యీ సమీక్షలో దానిని గూర్చి నాలుగు పుటలు (174—177) వ్రాసినారు. కాని అది శ్రీ వేలూరి శివరామశాస్త్రి

22. ఈ విషయమైన ప్రస్తావనయే ప్రస్తుత విమర్శ గ్రంథమున లేదు.

23. అలు ప్రత్యయ చరిత్రము. Annals of the Oriental Research Madras University, Vol. XVI 1959—60.

24. శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారు.

25. పు—ఉ. యతి మహాకవిప్రయుక్తమే!

26. దీనిని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు రచించినదియని ఆ కాలమున—ముద్రిత గ్రంథములను బట్టి వాదోపవాదములనుబట్టి సప్రమాణముగా నిరూపించాను. ఈ విషయమై శ్రీ శివరామశాస్త్రిగారి పేర వ్రాయగా, వారిట్లు బదులు వ్రాశారు.

"మీ 26 న కార్డు అందినది. బిడాలోపాఖ్యానం నా పేర ప్రకటించారుకాని గురువులదే."

పరిశోధకు లీ విషయము గుర్తింతురుగాక.

గారి రచనముగాని, తిరుపతి వేంకటకవులది కాదు. వాస్తవముగా నిది "వివాద కావ్యాల" సందర్భములో చెప్పవలసినదేకాని అన్యాపదేశ కావ్యాలలో చేర్చవలసినది కాదు. పూర్వ ప్రకటన పత్రికలలోకూడా, బిడాలోపాఖ్యానము తిరుపతి వేంకటకవుల గ్రంథాలలో చేర్చబడినా, ఈ గ్రంథము యొక్క కర్త విషయము అందులో స్పష్టముగా తెలుపబడియే యున్నది. క్రీ. శ. 1912 జాన్యువరి నెలలో వెలువడ్డ వారి గ్రంథాల ప్రకటన పత్రికలో ఇట్లున్నది.

బిడాలోపాఖ్యానము

"ఇది శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారిచే వ్రాయ బడినది. ఇందుఁ బెద్దపులికి పిల్లి గురువని లోకులను ప్రవాద తప్పనియు పెద్దపులియే పిల్లికి గురువనియుఁ జెప్పుచు నా ప్రవాద వచ్చుటకుఁ దగిన కారణము చెప్పబడిన బహుచమత్కారమైన కథ. 0—2—0"

శివరామశాస్త్రిగారే తమ గుంటూరు కాలేజీ శతావధానంలో, ఒక పృచ్ఛకుని ప్రశ్నకుత్తరముగా, బిడాలోపాఖ్యాన కథ ఒక్కపద్యంలో చెప్పారు.

రామకృష్ణ కవులకు తిరుపతి వేంకట కవులకు వివాదము వచ్చిన రోజులలో—శివరామశాస్త్రిగారు బిడాలోపాఖ్యానము రచించి ప్రకటింపగా శ్రీ వేదాల తిరువెంగళాచార్యులుగారు దానికి ప్రతిగా[27] 'శైష్యోపాధ్యాయికత' రచించారు. అందులో బిడాలోపాఖ్యానాన్ని, 'బిడాలకృతి'[28] అని పేర్కొన్నారు. ప్రభుత్వ ముద్రిత గ్రంథ పట్టికలలోను—"బిడాలోపాఖ్యానము—కర్త వేలూరి శివరామశాస్త్రి-కథ—1911" అని కలదు.[28]

పై విషయమును బట్టి ఈ గ్రంథమున తిరుపతి వెంకటకవుల 'గ్రామసింహము'తో దీనిని జతచేసి, వ్రాసిన వ్రాతలన్నియు నపాస్తములైనవి. ఇక మనకు సమకాలికులై, సజీవులైయున్న వారి రచనల కర్తృత్వమొకరి దింకొకరికి అంటకట్టబడి నప్పుడు ప్రాచీనకవికావ్యాల కర్తృత్వమును గూర్చి మనము తబ్బిబ్బులు పడుటలో ఆశ్చర్యమేమున్నది?

విడిచిపెట్టిన కృతులు

నేను ముందు చూపినట్లుగా, ఈ విమర్శ గ్రంథంలో తిరుపతి వెంకటకవుల కృతులన్నీ చేరలేదు. పాఠకలోకానికి విశదముగా ఉండుటకై వాని నీక్రింద వివరించుచున్నాను.

సంస్కృతము

1. ప్రథమ శతావధానము—50శ్లోకములు.
2. మూలస్థానేశ్వరస్తుతిశతకము
3. అష్టకములు—ఇందులో కాళికాష్టకము, గోపాలాష్టకము మొదలైనవి కలవు. పారాయణ యోగ్యములు. (1912).

—తెలుగు—

విమర్శనలు

1. అపూర్వ కవితా వివేచనము.ఇందు చక్కని కవిత్వ విమర్శనము, పూర్వకవుల పద్యములు కలవు. (రచన—1912)
2. [29]పూర్వ శాకుంతల విమర్శనము—ఇది విజయనగర సంస్థానాస్థానవిద్వాంసులైన పేరి కాశీనాథ శాస్త్రిగారి పూర్వశాకుంతల నాటకముపై విమర్శ.

---

27. వీరు సజీవులు. ఈ గ్రంథము 'కవిత' పత్రికలో అనుబంధముగా ప్రకటితమైనది.

క. కన నిరపరాధి యట న
న్ను నిరపరాధముగ నిందనుం బొనరిచి రం
ట నయము "బిడాల కృతి కృ
త్త"న నెవరో తానుగాక యన్యుండెవడో 9.వ.

(ఇందు 35 పద్యాలున్నవి.)

28. ఆంధ్రవాఙ్మయ సూచిక—ముద్రితగ్రంథ ముల పట్టిక. పుట 128.

29. శ్రీ పేరి కాశీనాథశాస్త్రిగారు(1856—1918)శ్రీమదానంద గజపతి ఆస్థానము నలంకరించిన మహాపండితులు. సంస్కృతమున నెంత విద్వాంసుడో తెలుగుభాషలో అంత గొప్పకవి. భాష్యాంత వ్యాకరణ పండితుడు. తిరుపతి వేంకట కవులకు విజయనగర సంస్థానమున, శృంగభంగము చేసిన మహామనీషి. విజయనగరమున జరిగిన యీ విషయ మీ విమర్శ గ్రంథమున ఏమాత్రము సూచితము కాలేదు. కాబట్టియే కాశీనాథశాస్త్రిగారి గ్రంథముపై విమర్శ యిందులేదు.

3. పురశ్చరణము
4. పిష్టపేషణము — సాహిత్య చర్చలు
5. పశ్యశబ్దవిచారము

ప్ర హ స న ము లు

1. తవిటి రొట్టె ప్రహసనము. పద్యము— 1913. ఇది క్రీ. శ. 1950 లో పునర్ముద్రిత మైనట్లున్నది. (చూడుడు. తిరుపతివెంకటేశ్వర కవి కృత గ్రంథములు. శ్రవణానందము ముఖపత్రము ముందు గ్రంథముల పట్టిక)

2. స్కూలుపిల్లల ప్రహసనము

3. నవీన విద్యా విలాసము

వే దా ం త ము

1. సూక్ష్మమోక్ష సూచిక—1895.

పై కృతులన్నీ క్రీ. శ.1927 కి పూర్వమే అచ్చయినవికాబట్టి కవితా సమీక్షలో ఇవి అత్యావశ్యకముగా పరిశీలింపబడవలసి యుండెను. కాని యీ గ్రంథమం దట్లు జరుగలేదు.

ఇందు విడిచి పెట్టబడినవి కృతులేకాదు. వ్యక్తులు కూడా విడిచి పెట్టబడినవారున్నారు. వారిలో ప్రముఖులుకీర్తిశేషులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

ప్రభాకరశాస్త్రిగారు బందరులో వేంకటశాస్త్రిగారి శిష్యులు.ఆ కాలమున కొప్పరపు వారితో రామకృష్ణ కవులతో వాగ్యుద్ధములలో పాల్గొన్నవారే-కొప్పరపు సోదరకవులే—

"తిరుపతి వెంకటేశ కవి
ధీరుల శిష్యుల మేమటంచు మా
గురువులు వారటంచు ననుకొన్న
ప్రభాకరశాస్త్రి ముఖ్యులు."

అని వీరిని పేర్కొన్నారు. క్రీ. శ. 1911 లోనే శాస్త్రిగారు ఈ వాదోపవాదములకు స్వస్తి చెప్పమని

"సతీర్థ్య సుప్రార్థనము"

అని పేరితో 20 పద్యాలు వ్రాశారు. దానిలో 44 చరణములు గల ఉత్పలమాలిక కూడా కలదు. అందుండి కొన్నిపద్యాలు..

"వేంకటశాస్త్రి పండితకవిప్రభు
పాదము లాశ్రయించి ని
శ్శంకముగా గడించితిమి శక్త్యనుసారము
సంస్కృతాంధ్ర కూ
లంకషసాహితిం గవనలాఘవముం
దగు శబ్దశాస్త్రమున్
జంకము యేము మాచదువు సర్వముఁ
దత్కరుణాత్తమేచుఁడీ
ఉడుగుండయ్య సతీర్థ్యులార! యుడుగుం
డొప్పైనా తప్పైనా మీ
యడుగుల్ మ్రొక్కి విధేయభావమున
నభ్యర్థించుచున్నాఁడ మీ
నుడుగుల్ పత్రికలోఁ బఠించి తవి వీనుల్
సూడినట్లయ్యె నే
చెడుగుల్ కోకిలకాకముం గవిన మీ
చెయ్దమ్ములన్ మెత్తురే.
తేటల్దేలిన సత్కవిత్వమున కీర్తిం
గాంచు చున్నట్టి మీ
బోటుల్ యత్కవితామృతాంబువిధి
కంభోదంబులై రానిరా
ఘాటుల్ తిర్పతి వేంకటేశ్వరులకుం
గారాబు శిష్యుండ, నా
మాటల్ కొంచెము వీనులంజొనుపుఁడీ!
మన్నింపుఁడీ! వేఁడెదన్.

తిరుపతి వెంకటకవులను గూర్చి మనము వ్రాసేటప్పుడు వారితో సన్నిహిత సంబంధమున్న శ్రీ వేలూరి, వేటూరి వారి అనుభవాలను సంగ్రహించి వ్రాసినట్లయితే, ఆ రచన ప్రామాణిక మవుతుంది. ప్రస్తుత గ్రంథకర్త లట్టి పరిశ్రమ చేసినట్లు కానరాదు. వేటూరివారు తమ అనుభవాలను ఒక వ్యాసంలో ప్రకటించారు.[30] సందర్భాన్ని పురస్కరించుకొని ఆవశ్యకమైన వాక్యాల నందుండి ఉదాహరిస్తున్నాను.

"నేను వెంకటశాస్త్రిగారి దగ్గఱఁ జదువుకొన నరిగిన నాఁడు 'అలపతంజలి కృతంబైన భాష్యమునకే పరిఢవిల్లను మహాభాష్యపదము' ఇత్యాది పద్యమును మోహనరాగరసమును పద్యభావమున

30. భారతి—అక్టోబరు 1933. శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి. పుటలు 611—615 ఇది వారి 'సింహావలోకనము'నందు పునర్ముద్రితమైనది.

జీర్ణింపజేసి వారు చదువగా తన్మయత చెందితిని. అంతకు బూర్వము భైరవ్యాది రాగములను తీగవార్చి పద్యముల సిడిగిలఁ బఱచి పౌరాణికులు చదువుతీరే నే నెఱిగినది. రసస్ఫూర్తితో తెలుగు పద్యములు చదువు చాతురికి నే డాంధ్రదేశమున శ్రీ శాస్త్రులుగారే యాచార్య పీఠము.........

పూర్వము భోజరాజు ముఖదర్శన మాత్రముననే పలువురు విద్వాంసులైరని ప్రతీతి. నేడు శ్రీ శాస్త్రుల వారి ముఖదర్శనమున నది ప్రత్యక్షమైనది.......,...

వేంకటశాస్త్రిగారి కవితా గంగా ప్రవంతిలో తిరుపతి శాస్త్రిగారి కవితా సరస్వతి యంతర్వాహిని.....

మెదడు కదలిపోవునో, నరముల బలము సడలి శరీరము నకనకలాడునో యని సాధారణ బుద్ధిమంతులు సందేహించునట్లు పగలు శతావధాన తంత్రము జఱపి, రాత్రి పదిగంటల దాక పరిపరి వినోదములఁ బాల్గొని తర్వాత నిమ్మకు నీరెత్తినట్లు నిశ్చలముగా నిద్రపోయి మరునాటి ప్రొద్దుట మరల మందహాస వదనముతో అల్పాహారములనైన యారగింపక యవధాన శేషమును పూరింప నారంభించు నీ జంటకవుల యంతఃకరణములు శ్రుతి కలసి యొకే "మనము" అయ్యెడివి. అది యొక వింత తీరు. ఆ సమయములందు వేంకటశాస్త్రిగారు విశ్వమూర్తులు."

"వేంకటశాస్త్రిగారికి లల్లాయిపదములు పాడవేడుక, కొల్లాయి గుడ్డలు వాడవేడుక.

భాషాడంబరము వేషాడంబరము వారికి గిట్టదు. కను కనే వారి కవితా కన్య "జనముద్దు"గా బెరిగినది."....

...."ప్రాచీనాంధ్ర కవులలోఁ బ్రబంధములకంటె శాశ్వతము లగునట్లు చాటు రచనలను సాగించినవాడు శ్రీనాథుడు. అతని చాటు రచనలు నేటికిని ఆంధ్ర రసికుల నాలుకలపై నాట్యమాడుచున్నవి. వర్తమానాంధ్ర కవులలో నట్టివారు మన తిరుపతి వెంకటేశ్వర కవీశ్వరులు."

కాని తిరుపతి వెంకటకవులు చాటువులు, సంగ్రహించుట కింతవరకు నే ప్రయత్నము జరిగినట్లు కాన్పించలేదు.[31] అట్టి చాటువులను ఈనాటి వారి కందఱకు పరిచితము కానివి కొన్ని మాత్రమే యుదాహరిస్తున్నాను.

సీ. అన్యభాషలకు వాగనుశాసనుండైన
నన్నయ కవి పెంచినాడు మున్ను
ప్రేమానుబంధంబుతో ముద్దు ముచ్చటల్
తిక్కన కవి మున్ను తీర్చినాడు
పరువుగా పల్లకీపై సర్వదేశముల్
శ్రీనాథకవి మున్ను త్రిప్పినాడు
లలితశయ్యారసాలంకారవస్తువుల్
పెద్దన్నగారు పంపించినారు
ఆంధ్రభాషావధూటిలో యార్యులార
ఇచ్చవచ్చినయట్లు మీ వచ్చినట్లు
నగలునాణంబులు బెట్టనగునుగావి
సూత్రముల్ ద్రెంపకుం డాంధ్ర
శూరులార!"

తమ పాకంబు స్వహస్త పాకగతి
శుద్ధంబైన గావిండు సా
జముగామిన్ శ్రవణంబులంజొనుప
దచ్చంబైన యల్లంతనే
రమణీయంబగునే కవిత్వము?
రసారామంబు గాకున్న మీ
శ్రమకున్ లేదు ఫలంబు మీ తెలుగు
గీర్వాణంబు లంఘించెడున్."

"ఉ. అచ్చ తెనుంగునం గనన
మల్లతిరే నది, దుష్కరంబునై
గ్రచ్చపాదంబలెం జెవికిఁ
గంటకమున్ బొనరింపుచుండు వి
ద్వచ్చయమాన్యులైన
తమవంటి మహాత్ములు కైత చెప్పగా
మెచ్చవలెన్ జగం బటుల
మెచ్చని శుష్క కవిత్వ మేటికిన్"

"క. పాండిత్యమున్న విబుధా
ఖండలులై శిష్యులకు దగం బాఠంబుల్
ఖండించి చెప్ప రాదొకొ
దండుగ కవనంబు చెప్పెదరె సారజ్ఞల్"

---

31. 'ఈ సందర్భమున విద్యన్మహాకవులు దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి తిరుపతి వెంకటకవుల యవధానమును గూర్చిన వ్యాసమును, శ్రీ అడవి శంకరరావుగారి శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి కవిత్వము' అను వ్యాసమును చవుడదగినవి.

ముట్టినదెల్లా మూర్తియైనట్లు, పట్టిన దెల్లా బంగారమైనట్లు చెప్పినదెల్లా పద్యమౌ తుంది—చెళ్లపిళ్లవారికి. ప్రతి పద్యములోనూ జాతి యమో, చమత్కారమో, రసమో చిప్పిలుతూ ఉంటుంది. ఎన్నెన్ని పద్యాలనైనా ఉదాహరించ వచ్చును. ముచ్చటకు మూడు మాత్రమే ఉదాహ రిస్తాను.

కాంచనపల్లి కనకాంబగారి కవితిలక బిరుద ప్రదానోత్సవ సమయమున చెప్పినది.

క. ఉవిదకు తిలకము కన్నన్
ప్రవిమల భూషణము లేదు, ప్రారబ్ధమునన్
దవులదది నీకు, బోనీ
"కవి తిలకము" నైతి వాత్మకల్యాణముగాన్

ఇంగ్లీషు తెలుగు పద సమాసాన్ని యీ క్రింది పద్యంలో చెళ్లపిళ్లవారు చక్కగా పాదిగారు.

"మ. నడికిన్ పూర్వులు జంకు వార లిపుడో
జంకన్నదే లేదు,
మున్ బిడియం బంగనకుండె
యిప్పుడది యుంటే పెద్దదోసం బహో
ఐడియాకుల్ మరీయున్
"విడోస్వరిణయా" విర్వాముల్ తల్లి,
ఈ చెడుకాలాన మనస్వి యే విధముగా
జీవించు గామేశ్వరీ."

ఇంగ్లీషు తెలుగే కాదు, పెక్కు భాషలు కలిపి వ్రాసిన యీ క్రింది పద్యం చూడండి.

బహు భాషాపద శ్లోకం.[32]

శ్లో. యూయం తత్ర సిడౌన్ తథాపి
వెరివెల్ తస్మాన్మయాయాశు
వో గో సార్, మదరాసు కాయకరితం
హింగేందు బాయేందునం
నింగత్సూరయ వింగ కూద విడుదల్
నీవాడ నంటిం గదా
కస్వాస్తే మయి బోల్తహం
అజి సునో తక్సీర్ నమేరే ఉపర్.

గోషీ పెట్టింది మొదలుకొని గొంతుకలో ప్రాణాలుండే వరకు గద్య భారతిని, కవితా నర్తకిని నాట్యము చేయించిన చెళ్లపిళ్ల వారి వచనరచనా విశేషాలను ప్రస్తావించడానికి అవకాశము లేనందున విరమిస్తున్నాను.

వెంకటశాస్త్రిగారు దేశములో పత్రిక లన్నిం టికి వ్రాసినా — ఆంధ్రపత్రిక, భారతి యందు వారికి ప్రత్యేకాభిమానం. తిరుపతి వెంకట కవులను గూర్చిన విషయాలెన్నో గ్రహించ వలసినవి అందు ఉన్నవి. వెంకటశాస్త్రిగారి తుదిరచన ప్రకటించిన గౌరవము 'భారతి'కే దక్కినది.[33] ఇవన్నీ పరిశీలించి నట్లయితే, "తిరుపతి వేంకటేశ్వర వాఙ్మయము" అంతు కొంతైనా చిక్కుతుంది.

ఈ సాహిత్య సమీక్షాగ్రంథం 300 పుట లలో విడిచి పెట్టబడిన విషయాలే, ఈ వ్యాసంలో వివరించడము జరిగింది. ఇక రచనలోని అతిశ యోక్తులు భాషా చారిత్రక నామ విపర్యాసాలు విమర్శించడము మొదలు పెడితే మరొక పెద్దవ్యాస మౌతుంది. మచ్చుకి కొన్నింటిని ఉదాహరిస్తున్నాను.

పుట 25. "మాడభూషి వెంకటాచార్యులు గారు శత దూషిణి మీద ఖండన చెప్పిన మహా మేధావి."

ఇది సరికాదు. శతదూషిణి మీద ఖండన రచించినవారు మహామహోపా ధ్యాయ అనంతకృష్ణశాస్త్రిగారు. ఈ ఖండనపేరు శతభూషిణి.

పుట 26, "తిరుపతి కవుల కవితలోని ప్రసాద గుణము రామరాజ భూషణుని కవిత యందు లేదు."

పుట 27. "ఈ పోకడలు పూర్వ కవులలో లేవు. ముందు కవులలో నుండవు. సమకాలికు లలో కనిపించవు"

పుట 28. "ఇద్దరు కలిసి అవధానము చేయుట యదివరకెన్నడు నెరిగినది కాదు." తిరుపతి వెంకటకవులకు ముందు దేవులపల్లి సోదరకవులు శతావధానము చేసియున్నారు.

---

32. ఇందలి పదము లేయే భాషలకు చెందినవో, భాషా వేత్తలయిన వారు వివరింతురు గాక.

33. భారతి—మార్చి—1950.

పుట 29. "చెన్న పట్టణమునందు సైతము తెనుగు సాహిత్య సరస్వతి కొక పీఠము స్థాపించినారు తిరుపతి కవులు. ఆ నాటి చిహ్నమే యీ నాటికి చిరస్థాయిగా నిలిచినది."

చెన్నపురిలో తెనుగు సరస్వతి పీఠము— తిరుపతి వెంకట కవులకంటె ఒక శతాబ్దికి ముందే స్థాపిత మైనది.

చిన్నయసూరి, కొక్కొండ, బహుజన పల్లి — ఆ పీఠము నలంకరించిన పండితత్రయం.

పుట 34. "సంస్కృత పండితులు తిరుపతి కవుల ప్రతిభ కన్నార వీక్షించి వంచలేక వంగి పోవుచు వచ్చిరి. విజయనగరము నందే యట్లు జరిగినది."

ఇది సుతరాము అసత్యము. విజయ నగరమున తిరుపతి వెంకట కవులకు శృంగభంగ మైనది. (చూడుడి వ్యాసమునందే)

పుట 38. "తిక్కన కవితయం దచ్చటచ్చట క్లిష్టాన్వయములు గలవు. తిరుపతి కవుల పద్యములన్ని పరిశీలించి చూచిన నెచ్చటను క్లిష్టాన్వయము లుండవు.

పుట 44. "ఇట్టి ఉభయ వాణీ పతులగు తిరుపతి కవులు ఒకొక్కప్పుడు శ్రీనాథునికన్న మిన్నలేమో యనిపింతురు."

పుట 50. "తెనుగునందు శ్రీనాథుని వరకుగల కృతులన్నియు నాంధ్రీకరణములు"

మల్లికార్జున పండితుని శివతత్త్వ సారము, పాల్కురికి సోమనాథుని బసవపురాణ పండితారాధ్య చరిత్రలు— ఇతర కృతులు వేనికాంధ్రీకరణములు?

పుట 61. "పూర్వ కవులలోగాని సమకాలికులగు కవులలోగాని యిట్టి వర్ణన చేసిన వారు లేరు".

పుట 69. ...చుక్కెదురు కైసరుబొజ్జ బూడిదె బుస్స—కైసరు బొజ్జ కాదు. అది ఐసరుబొజ్జ—హైసరు బొజ్జ రూపాంతరము. "తదీయాంతర భావముల్ తెలియ కైసరు బొజ్జ యటంచు నుబ్బుచుం" అని యతిస్థానములో నున్నది.

తెలియక + అయిసరు బొజ్జ, ఐసరుబొజ్జ (3—74)

=తెలియకైసరుబొజ్జ అని పదచ్ఛేదము.

పుట 77. "చ. రొక్కము లేకకాదు
నినురోసియు గాదు
మరొక్కలేమకున్ దక్కియుగాదు
చెప్పెద యథార్థపు సంగతి
చిత్త కార్తిలోన్ గుక్కలరీతి
నొక్కవెల కోమలికై
పలుమంది చేరినన్
జిక్కు లనేకముల్ గలుగు
చీ యనిపించి విరక్తి జెందితిన్"

ఇదియొక గార్య చాటువున కనుకరణము.

రొక్కము లేకగాదు నిను రోసియుగాదు
మరొక్కలేమకున్ దక్కియుగాదు
చెప్పెద యథార్థపు సంగతి
చిత్త కార్తిలోఁ గుక్కలరీతి
నీ వెనుక కోటులు దుర్విటులుంట జూచి
యింకెక్కడి పావినేస్తమని
యేటి విరక్తి యటంచు జారితిన్.

పుట 86. ఆశు కవితయందిట్టి వంగ్య సహిత మైన కవిత చెప్పుట కెవరికి సాధ్య మగును?

లక్షణాపరిణయ మాశు కవితా ధోరణిని చెప్పినదా?

పుట 111. అశ్వఘోషుని బుద్ధ చరిత్ర నాధార ముగా చేసికొని మాథ్యూ ఆర్నాల్డు అను వాంగ్ల విద్వత్కవి లైట్ అవ్ ఏషియా అను పద్యకావ్యమును వ్రాసెను. 'లైట్ ఆఫ్ ఏషియా' అను పద్య కావ్యము వ్రాసినది "ఎడ్విను ఆర్నాల్డు" కాని — విమర్శకుడు, కవి యగు మాథ్యూ ఆర్నాల్డు కాదు.

పుట 132–154. వివాద కావ్యములు— ఈ శీర్షికలో గల విషయములన్నియు తిరుపతి వెంకట కవుల గ్రంథములనుబట్టియే సాక్షికముగా నున్నవి. రామకృష్ణ కవుల రామకృష్ణ భారతము, పస్పశము, పరాస్తపాశుపతము చూచినచో — ఆ వివాదము లెట్లు పరిణమించినదియు తెలియగలదు.

పుట 161. ఈ రచనా చమత్కారమునకే వర్డ్సు ఎకోయింగ్ ది సెన్సు అని పాశ్చాత్యు లందురు.

పాశ్చాత్యులు "సౌండ్ ఎకోయింగ్ ది సెన్సు" అందురు.

పుట 169. "నారాయణదాసు మహాపండితుడు. మాట నేర్పరి......

"పరమ ధూర్తుండు వూ కంటి పండితుండు" అని మరొక పండితుని గురించియు చెప్పినటుల వినికిడి."

ఒకరు చెప్పినదానిని విషయముతెలిపికోకుండా, మరియొకరి కంటగట్టుట మహాపరాధము. "పరమ దురితుండు వూ కంటి పండితుడు" అని చెప్పినది తిరుపతి వెంకటకవులే — ఆ పండితుడు సామాన్యుడుకాడు. వైయాకరణ దిగ్దంతి కళాప్రపూర్ణ వఝ్ఝుల చిన సీతారామశాస్త్రిగారు[34] - ఆ కాలమున వారు బొబ్బిలి దరి పాలతేరు (వారి స్వగ్రామము)లో నుండువారు. బొబ్బిలిలో అవధానము జరుగలేదు. ఇది వఝ్ఝల వారితో వ్యాకరణ శాస్త్రమున చర్చలు జరిగి తిరుపతి వేంకటకవులు తిరోహితులైన సందర్భములో చెప్పినది.

పుట 232. "తిక్కనగారిని తిరుపతి కవులు మించి పోయిరనిన నతిశయోక్తి లేదు". తిక్కనగారు పాదపూరణ కొఱకు చివఱ వేసిన సమాసము (దుర్దాంత చంచద్భుజాసంగ్ర కీడిత విక్రమ క్రమ కళా సంక్రీడనోన్మాదినై — అనునది) విరర్థకమని యెట్టి వారికైన నీ పద్యము (తిరుపతి వేంకటకవులది) చదివిన మీదట తోచకపోదు.

పుట 266. పండితరాజము....... ఇది సాంఘిక నాటకము. దీనిని తిరుపతి కవులు మొట్టమొదటుగా వ్రాసిరి. అప్పటికి తెనుగు దేశమున సాంఘిక నాటకములు వ్రాసినవారు లేరు.

ఇది నాటక చరిత్ర తెలియక వ్రాసినది. క్రీ. శ. 1880 లో వావిలాల వాసుదేవశాస్త్రిగారు నందక రాజ్యమును, క్రీ. శ. 1896 లో ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మగారు "మనోరమా" నాటకమును, ఆ సంవత్సరముననే వల్లూరి బాపిరాజుగారు "సుగుణమణి" నాటకమును వ్రాశారు.

క్రీ. శ. :900 లో తురగా వెంకటాచలంగారు "గణికా హితబోధిని" వ్రాశారు.

పుట 283. "అందు భారతమును గురించి వారు (తిరుపతి వేంకటకవులు) చేసిన పరిశ్రమ పొగడ తగినది. కందుకూరి వీరేశలింగముగారు గిడుగు రామమూర్తి పంతులుగారు కూడ అంత పరిశ్రమ చేయలేదనవచ్చును."

పుట 297. దివాకరాస్తమయ శీర్షికలో—

రామచంద్ర కృష్ణ భూపతి-కృష్ణభూపతికి కృతిసమర్పింప బడినది-రామచంద్ర కృష్ణ భూపతి—(పుట 300) అని కలదు. కాని పోలవరము జమీందారు పేరు 'రామచంద్ర వెంకట కృష్ణారావు' గాని కృష్ణ 'భూపతి' కాదు.

పుట 313. "వేంకటశాస్త్రిగారు 50 యేండ్ల క్రిందట స్వీయ చరిత్ర వ్రాయడం మొదలు పెట్టినారు."

స్వీయచరిత్రలు పద్యాలతో వ్రాయడం వెంకటశాస్త్రిగారి రచనకు ముందే

34. వీరు రెండేండ్లక్రిందట కీర్తిశేషులైరి.

ప్రారంభ మైనది. క్రీ.శ. 1886 లో మండపాక పార్వతీశ్వరశాస్త్రి గారు ఆత్మ సపర్యాచర్య— అని తమ స్వీయచరిత్ర పద్యకావ్యంగా వ్రాసుకొన్నారు. క్రీ. శ. 1887 లో కొక్కొండవారు తమ స్వీయ చరిత్ర పద్యాలలో లిఖించుకొన్నారు.

స్థాలీపులాకన్యాయంగా కొన్ని మాత్రమే చూపించాను. ఇంకొక్కటి చూపి— యిది ముగిస్తాను.

పుట 273. "గిడుగు రామమూర్తి పంతులుగారు మహాపండితులు. గొప్ప మేధావి. భాషా పరిశోధకులు. కావ్యములు వాడుక భాష యందు వ్రాయవలయునను వాదము లేవదీసెను. వారి యను యాయులు పానుగంటి లక్ష్మీ నర సింహము గారు సాక్షి వాడుక భాష యందు వ్రాసిరి."

ఇంత విశదముగా, అచ్చులో, గిడుగు రామమూర్తి పంతులుగారు వాడుక భాషను వచనములోకాక, కావ్యములలో వ్రాయవలెనని చెప్పిరనియు, పాను గంటి లక్ష్మీ నరసింహముగారు (వీరి సరియగు పేరు పానుగంటి లక్ష్మీ నరసింహారావుగారు) సాక్షి వాడుక భాషలో వ్రాసినారనియు, గ్రంథ కర్తలు వ్రాసినప్పుడు వారి యభిజ్ఞత యెంతయో, పాఠక లోకమే గ్రహించు నని నేను ప్రత్యాఖ్యానము చేయకుండా విడిచి పెట్టుచున్నాను.

బహుమతి గ్రంథము

ఈ సమీక్షా గ్రంథము బహుమతి గ్రంథ మైనట్లుగా అట్టపైనున్న ఈ క్రింది మాటలవలన తెలియవచ్చుచున్నది.

"తిరుపతికవుల సాహిత్య సమీక్ష

(ఆంధ్ర ఎకాడమీ బహుమతి పొందినది)

కాని పరిచయమున "కవిసామ్రాట్టులు" ప్రారంభము చనే యిట్లా వ్రాశారు. "శ్రీ శిష్ట్లా లక్ష్మీకాంత శాస్త్రిగారు ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు ప్రకటించిన రు. 2000—00 లు బహుమతి కొఱకు శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవుల జీవితమును మిక్కిలి శ్రద్ధతో రచియించిరి. బహుమతి వారికి లభించినది."

దీనినిబట్టి గ్రంథకర్తలు వ్రాసిన "ఆంధ్ర ఎకాడమీ" ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడమీ అని పరిచయకర్తల వాక్యాలనిబట్టి మనము గ్రహింప వలెను. అసలు ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడమీవారు తమ సంస్థను "ఆంధ్ర ఎకాడమీ" అని వ్యవహ రించుటకు అంగీకరింతురా?

ఇక గ్రంథనామము సందేహాస్పదముగానున్నది. పరిచయ వాక్యాలనుబట్టి శ్రీ తిరుపతి వెంకటేశ్వర కవుల జీవితము" అనియుండగా, గ్రంథము పైని లోప లనూ.

"తిరుపతి కవుల సాహిత్య సమీక్ష"

అని మీద వ్రాసినట్లేయున్నది. ఒకవేళ వ్యవహారమున నున్నను సాహిత్య ప్రపంచమున తిరుపతి వెంకటేశ్వర కవులని తిరుపతి వెంకట కవులనియే గాని,[35] 'తిరుపతి కవులని వాడుకలేదు. ఇది బహుమతి పోటీలో బహుమానము పడసిన గ్రంథము కాబట్టి ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారే పోటీవిషయ మునకు పెట్టిన పేరేదియో తెలియపఱచెదరుగాక.

---

35. వారి గ్రంథములన్నింటిమీద "తిరుపతి వేంకటీయము" అనియే యున్నది.

[రచయిత : శ్రీ ఎస్. లక్ష్మీకాంతశాస్త్రి, నిర్మలా పబ్లిషర్స్, కుమ్మరవీధి, విజయవాడ, వెల : రూ. 10—00.]

# లేఖలు

## భారతి

అయ్యా,

భారతి పత్రికను నేను 8 సంవత్సరాలుగా చదువుతున్నాను. ఆ పత్రికలన్నీ పోకుండ పదిలంగా బైండు చేయించుకొని అప్పుడప్పుడూ తిరిగి చూస్తూంటాను. అంటే భారతి కేవలం ఒక మాసపత్రికేకాదు. దానికి Reference book విలువ వున్నది.

ఇప్పుడు వెలువడుతూన్న పత్రికకు, ఒక నాలుగ సంవత్సరాలకు పూర్వం వెలువడిన పత్రికకూ తేడా స్పష్టంగాకన్పిస్తూంది. 1962 అంతకుపూర్వం 92 పేజీల నుండి 108 పేజీల వరకూ వేసేవారు. మరి యిప్పుడో 88 పేజీలకు మించడమే లేదు. ఇది కరువు కాలం. ఒక్కరూపాయికే పూర్వంవలె అన్నిపేజీలు వేయమనడం సబబుగాదు. ధరపెంచండి. 100 పేజీలకు తగ్గకుండా చూడండి. ఇది వ్యాపార సూత్రాలకు అనుగుణంగా లేదంటారా? ఏమో ఓ 25 పైసలు ధర పెంచినా భారతి పాఠకు లెవరూ ఆ పత్రిక కొనడం మానివేయరనే నా నమ్మకం.

ప్రస్తుత వత్సరం అంటే 66లో వెలువడిన భారతి పత్రికలు శ్రద్ధగా మరొక సారి పరిశీలించండి. అసలీ పత్రికల్లో చదవదగినదంటూ ఉండేది చాలా కొద్దిగానే వస్తోంది.

• భారతి ప్రాథమికంగా సాహిత్య మాసపత్రిక. మరి ఇప్పుడు మన పత్రిక రంగులు మార్చుకొని ఎన్‌కౌంటర్ వాతలు పెట్టుకొంటోంది. దీన్లో రాజకీయవ్యాసాంతో తల పగిలిపోతుంది. ఇలా రాజకీయ వ్యాసాలిచ్చే పత్రికలు చాలా ఉన్నాయి. భారతి పని అది కాదు. సాహితీ ప్రపంచం, రసమయజగత్తు దాని పరిధి. మరి ఇప్పటి పత్రికలో రసమయమైన విషయాలెన్ని ఉంటున్నాయో మీరే ఆలోచించండి. ఉదాహరణగా సెప్టెంబర్ 66 పత్రికే తీసుకోండి. ఉన్న పేజీలు మొత్తం 84. ఇందులో 20 పేజీలు గ్రంథ విమర్శలు. అందులో నిడదవోలు వారివి 14 పేజీలు.

కవితకు 9 పేజీలు.
చారిత్రిక విషయాలు 6 పేజీలు.
లేఖలు 8 పేజీలు.
కలగూరగంప 2 పేజీలు.
సైన్సుకు 6 పేజీలు.
రాజకీయాలకు 6 పేజీలు.
కథకు 10 పేజీలు.
సాంఘిక పరిస్థితుల చిత్రణ 8 పేజీలు.
భగవానుడికో 6 పేజీలు.

Matter మొత్తం 81 పేజీలు. ఇందులో కూడ పేజీలో కొంతభాగం ప్రకటనలు. ఈ పై శీర్షికల్లో సాహితీప్రియులుకు పనికి వచ్చేవెన్ని? గ్రంథ విమర్శలు 20 పే, కవితలు 9 పే, చారిత్రిక విషయాలు 6 పే, లేఖలు 8 పే, కలగూరగంప 2 పే, కథ 10 పే, మొత్తం మీద ఎక్కువభాగం సాహిత్యానికే వినియోగిస్తున్నట్లు కన్పిస్తూంది. కాని వీటిని విడగొట్టి బాగా పరిశీలించి చూడండి.

కథలు ఏమీ బాగా ఉండటంలేదు.

నిడదవోలు వారి పుస్తక సమీక్ష, అది వారి స్వంత వ్యాసమేకాని సమీక్షగాదు. ఇందులో నాకు నచ్చనివీ, వేయరానివిగా కన్పించే విషయాలు, రాజకీయాలు, సైన్సు, వే. శి. శాస్త్రిగారి ఛాందసం. ఇందుకెవరైనా కోపగించుకుంటే అది నా తప్పుగాదు వే. శి. శాస్త్రిగారు గొప్ప విమర్శకులు, ప్రముఖ సాహితీ శిరోమణి. సందేహంలేదు. ఇంకా యిప్పుడు గూడ పురుషోత్తముడ్ని గురించి వారు వ్రాస్తున్నారు. వేయకపోతే వారేమనుకొంటారోనని మీరు వేస్తున్నారు. చదివే ఓపిక మాకులేదు. చదివినందు వల్ల కలిగే

రసానుభూతిలేదు. అందుకే నా దృష్టికి అది ఛాందసం. ఇక ఈ రాజకీయాలు, సైన్సుకు కూడ మేము వెల చెల్లించుకోలేం. దయచేసి మానివెయ్యండి. సాహితీ పత్రిక రసోత్పత్తికంగా ఉండాలిగాని ఏదో ఒకసారి చదివి అవతల పారవేసే దినపత్రిక వలె ఉండగూడదు. ఒక్క విషయం గుర్తుంచుకోండి. మీ పత్రిక కొనే వారు, సాహితీప్రియులే గాని, రాజకీయవేత్తలూ, సైన్సువాళ్ళూగాదు. ఆ చెత్తచెదారంతో పత్రిక నింపక మరికొన్ని కథలో, సాహితీ చర్చలతోనూ, పత్రికను చదివే మామనస్సులను రసమయం చెయ్యండి. అంతేగాని ఈ రాజకీయాలూ, సైన్సు, వే. శి. శాస్త్రిగారి వ్యాసాలతో మాకు విసుగు పుట్టించకండి.

1962 నాటి పాత పత్రికలు తిరుగవేయండి. అందులో రెండు కథలు, లేక నాటిక, మంచివ్యాసాలు వున్నాయి. అప్పుడు పేజీలు ఎక్కువగా ఉండేవి అని మీరు సమాధానం చెప్పవచ్చు. అందుకే ఈ చెత్తను విసర్జించి మీరు మన పత్రికను సంస్కరించండి అని ప్రార్థిస్తున్నా.

మరోసారి మీకు గుర్తు చేస్తాను—భారతి ప్రాథమికంగా సాహిత్య మాసపత్రిక.

నా విజ్ఞాపనను గుర్తిస్తారనే ఆశతో.

—అల్లూరి వెంకటరావు.

## తిక్కన నిర్యాణము

ఆర్యా!

1966 సం. జులై నెల భారతి 24 వ పేజీలో తిక్కన మహాకవి నిర్యాణమును గురించి సాంప్రదాయముగా వచ్చుచున్న పద్యమిట్లున్నదని—

క. అంబర రవి శశి శాకా
బ్దంబులు చన గాళయుక్తి భాద్రపదపు మా
సంబున నంబరమణి బిం
బం బనదగు తిక్కయజ్వ బ్రహ్మము జేరెన్.

అను పద్యమును వ్రాయుచు దాని ప్రకారము కవి బ్రహ్మ క్రీ. శ. 1288. శా. శ. 1210 నాడు నిర్యాణము జెందెనని చెప్పవలసి యున్నది, అదియే నిజము కావచ్చును, కాబట్టి యాతడు సరిగా డెబ్బదియెనిమిది సంవత్సరములు మాత్రమే జీవించి యుండును—అని వ్రాసినారు.

పై పద్యములోని మొదటి చరణములో గల సాంకేతిక పదములకు సరియగు గణితమును బట్టి క్రీ. శ. 1199. శా. శ. 1120 కాళయుక్తి సంవత్సరము అగుచున్నది. పై పద్యములో వలె గాక "అంబర శశి రవి" అను సాంకేతిక పదము ఉన్నచో క్రీ. శ. 1288. శా. శ. 1210 సర్వధారి కాగలవు....

శా. శ. 1210 కాళయుక్తిగాక సర్వధారి యగుచున్నది. కాళయుక్తి పదము నెత్తివేసి—సర్వధారి వేసుకొన్నను పద్య లక్షణమునకు బాధ లేదు అని వ్రాసినారు. ఆ పద్యము మొదటి చరణములోని సాంకేతిక పదముల గణితమునకు యెట్లు బాధలేకుండునో తెలియకున్నది. తెలుప ప్రార్థితులు

—కాకాని కోటయ్య

# గ్రంథ విమర్శలు

## పునర్జన్మ

[నవల. రచన, విశ్వనాథ సత్యనారాయణ. ప్రచురణ: యం. శేషాచలం అండ్ కో, మదరాసు. మచిలీపట్టణము, పుటలు: 288 వెల: రూ 3—50]

డెబ్బయ్యోపడిలో శ్రీ సత్యనారాయణగారు వ్రాస్తున్నవి అఖ్యాయికలు (Novels) కావు, కల్పనలు (Romances). మరీ చిన్నపిల్లలకోసం ఉద్దేశింపబడిన తాతయ్య కథల్ని 'ఫెయిరీటేల్స్' అంటారు. అవే ముదిరితే, సాహసకృత్యాలూ, అద్భుత సన్నివేశాలూ కలిస్తే, 'రొమాంటిక్ టేల్స్' అవుతాయి. ఉ. అరేబియన్ నైట్స్, కాశీ రామేశ్వర మజిలీ కథలూ. 'పురాణ వైర గ్రంథమాల' పేరుతో వ్రాయబడిన నవలలన్నీ యీ కోవకు చెందినవే. పదీపదహారేళ్ల మధ్యవయస్సు వాళ్లకి (లేక ఆ మనోధర్మం కలవాళ్లకి) చక్కని పఠనీయ గ్రంథావళి. పోతే, 'పునర్జన్మ' అనబడే యీ సరిక్రొత్త 'కల్పన' (Romance) యొక్క విశిష్టత ఏమంటే—ఇది ముసలివాళ్లకు ఉద్దేశింపబడిన 'రొమాన్స్'. అందులోనూ మగవారికే ప్రత్యేకం!

కథానాయకుడు నీలకంఠశాస్త్రి అరవై ఏళ్లవాడు. మొదటిభార్య హయాంలో సుఖపడినాడు. ఆమె పోయి ముప్ఫై ఏళ్లయింది. రెండో పెళ్లి 'బలవంతాన' జరిగింది. వచ్చిన మనిషి మడ్డిమనిషి. సంస్కారము లేదు. గయ్యాళి. నోటికి రుచిగా, వేళకు సరిగా, వంట కూడా చేసిపెట్టదు. శాస్త్రి మనస్సుకీ శరీరానికీ సుఖం కరవైంది. ఈ క్రొత్త సంబంధం తాలూకు బావమరది ఆస్తి మీద పెత్తనం దొరకబుచ్చుకున్నాడు. ఉన్న యిద్దరు కొడుకులూ పెద్దవాళ్లై తమ స్వార్థం తాము చూచుకుంటున్నారు. రెండో పెళ్లికి కలిగిన కొడుక్కి ఏళ్లు వచ్చినా, మాటలు రాలేదు. ఈ పరిస్థితిలో శాస్త్రికి యిల్లు నరకమై, బంధువుల యిళ్లలో, ముఖ్యంగా మనోహరం అనే మేనల్లుడి యింట్లో, హైదరాబాదులో, రోజులు వెళ్లబుచ్చుతూ వుంటాడు. నీలకంఠంశాస్త్రి వంటి వ్యక్తికి 'రొమాన్స్' అంటేఎలా వుంటుంది? సిటీ బస్సులో వెడుతూ ఇరవైఏళ్ల కాలేజీ అమ్మాయిని చూస్తాడు. తన మొదటిభార్య జ్ఞాపకం వస్తుంది. వట్టి జ్ఞాపకంకాదు. తన మొదటి భార్యే మళ్లీ బ్రదికి వచ్చినట్లనిపిస్తుంది ఆ పోలికలు చూస్తే!.. సాధ్యమా? ఏం? ఎందుకు కాగూడదూ?..'పునర్జన్మ' సిద్ధాంతం ఉందిగా!.. అవును, ఆ అమ్మాయి తన మొదటి భార్యే, తన కోసమే మళ్లీ జన్మఎత్తి, అదే రూపం సంతరించుకొని, తన కోసమే వచ్చింది!... ఇక్కడి నుంచీ కథాప్రారంభం! అయితే, ఆ అమ్మాయి తనని గుర్తిస్తుందా? తను మారిపోలేదా? ముసలివాడవ లేదా? గడ్డం, తలా, నెరవలేదా? అయితేనేం! 'పతివ్రత' గుర్తించి తీరుతుంది! అని సమాధానం... అదిగో, గుర్తించిందయ్యా! అలానే చూస్తూ నిలబడిపోయింది!—ఇలా 'కల'ని 'కథ'నిచెయ్యడమే ఈ నవల కీలకం. ముసలివాడైన నీలకంఠశాస్త్రి రొమాంటిక్ హీరోగా మారిపోతాడు. ఆ అమ్మాయి చిక్కుపరిస్థితుల్లో వున్నది—a damsel in distress కావద్దూ మరి రొమాన్స్‌కి! ఆ పరిస్థితులూ చిక్కులూ ఎటువంటి వంటే వాటిని వ్యవహార జ్ఞానం, అనుభవం గల తనవంటి వాడు మాత్రమే ఎదుర్కొని పరిష్కరించగలడు! (ఆ అమ్మాయి ఎవడో ఇరవై రెండేళ్ల యువకుణ్ణి ప్రేమించిందనుకోండి, ఆ అర్భకుడు ఆమెను వ్యవహారపు చిక్కుల్లోంచి ఏం రక్షించగలడు? ఇదీ, అరవై ఏళ్ల హీరోకి ఈ సన్నివేశంలో వుండే ధీమా!) ఇక చూసుకోండి: శాస్త్రిగారు నడుంకట్టగానే చకచకా అన్నీ జరిగిపోతాయి. హీరో కత్తికి అడ్డంలేదు. ఉండకూడదు. చిక్కులన్నీ పొగమంచులా విడిపోతాయి. శాస్త్రి రెండోభార్య అధ్వాన్నపు చావు చచ్చి పీడా వదిలిపోతుంది. ఆమె తాలూకు సంతానం, ఆ మాటలురాని వాడు, అపర 'కాళిదాసు'లాగా దైవ మహిమ వల్ల ఉన్నట్లుండి మేధావి అయి, I.A.S. పరీక్ష యిచ్చి, కలెక్టరై పోతాడు! ఇంతలో శాస్త్రి కథానాయికను ఒక శుభముహూర్తాన 'పెళ్లి' చేసు

క్రుంటాడు. అయితే ఈ పెళ్ళి నిజంగా అవసరమా? అని సందేహం కలగవచ్చు. లోకానికి 'ధర్మాన్ని' నచ్చ చెప్పడం కోసం అతంతు మళ్ళీజరగాలిట.(పుట143). అందరూ సుఖపడతారు. పునర్జన్మ ఎత్తిన సాధ్వి తనువు చాలిస్తుంది. (వయసు తక్కువే, అయినా 'పునిస్త్రీ' చావు ముఖ్యంకదా!) అప్పుడు నీలకంఠశాస్త్రికి 'నిజంగా' వైరాగ్యం వచ్చి సన్న్యాసిగా ఎక్కడికో వెళ్ళిపోతాడు.

పునర్జన్మకు కారణం జీవుణ్ణి 'వాసనలు' వదలక పోవడం. ఈ కథలో కథానాయిక జానకి పునర్జన్మకు కారణమైన 'వాసన' — ఆమె శాస్త్రితో చెప్పిన మాటలు—"మీకు నేను వెనుకటి జన్మలో భార్యగా నుండి ఒక సుఖమనుభవించాను.. మీయందు నేనొక ఏకాగ్రతను పొందాను. ఆ ఏకాగ్రత నాకు చాల ప్రియంగా వుంది... అనంతకోటి స్త్రీలున్నారు. అనంత కోటి పురుషులున్నారు. స్త్రీపురుష సంగమక్రియా చిత్తవృత్తికి ప్రాధాన్యంలేదు. అది తాత్కాలికము. దానికి నిత్యత్వం లేదు. కాని తత్సంబంధ మొకటి యున్నప్పుడు ఒకచోట పరమేశ్వరానుగ్రహం చేత ఏకాగ్రత సిద్ధిస్తే ఆ ఏకాగ్రత అనే విషయికి ఆ సంబంధం విషయమైతే ఆ విషయిత్వం ఈ విషయం మీద మిక్కిలిగా ఆధారపడి వుంటే తదపేక్షయా దీనిని కోరటం ముక్తిమార్గంకాని లౌకిక భోగవాంఛాపద్ధతి కాదు.." ఇక్కడ 'స్త్రీపురుష సంగమక్రియాచిత్తవృత్తికి ప్రాధాన్యం లేదు' అంటూనే తత్సంబంధము ప్రాతిపదికగా జానకికి 'ఏకాగ్రత' సిద్ధించినట్లూ, అది ముక్తిమార్గమైనట్లూ, సమర్థన. ఏకాగ్రతకు ఆధారం 'సంబంధమూ', ఆ సంబంధానికి ప్రధానలక్షణము స్త్రీపురుష, సంగమక్రియాచిత్తవృత్తీ సెక్స్ అయినప్పుడు 'సెక్స్'కి ప్రాధాన్యం లేదనడంలో అర్థంలేదు! జానకి అనే జీవి విషయంలో ఒకానొక 'సెక్స్' సంబంధంలో సిద్ధించిన 'ఏకాగ్రత' ముక్తిసాధనము లేక మోక్షమార్గము అయితే, మరొక జీవి విషయంలో, ఆ జీవి ప్రత్యేకలక్షణాన్ని అనుసరించి సెక్స్ సంబంధంలో అన్వేషించే 'సమగ్రత' లేక 'వైవిధ్యము' కూడా ముక్తిమార్గముగానే సమర్థించవచ్చు కదా! ఏతావాతా, ఇక్కడ గమనించవలసింది, ప్రధానమైందీ, 'సెక్స్' విషయంలో వ్యక్తి సాధించే 'ఏకాగ్రతా' కాదు, 'వైవిధ్యమూ' కాదు, అసలు 'సెక్స్' అనే విషయవాసన నుంచీ పొందవలసిన విముక్తి! అయినప్పుడు ఆధ్యాత్మికవాదియైన శ్రీ సత్యనారాయణ గారు ఈ నవలలో స్త్రీ పాతివ్రత్యాన్ని గూర్చి పడే ఆదుర్దా 'ముక్తి'ని గూర్చి పడితే బాగుండేది!

పై చెప్పిన సంగతే హీరో నీలకంఠశాస్త్రి సంస్కారాన్నీ, 'వాసనల'నీ పరిశీలిస్తే మరీ చక్కగా అవగాహన అవుతుంది. నవలలో పతాక సన్నివేశం— హీరో హీరోయిన్లకి రచయిత 'ఏకాంతం' ఏర్పాటు చెయ్యడం. (అధ్యాయాలు 7, 8.) ఆ ఏకాంతంలో నీలకంఠశాస్త్రి చిత్తవృత్తి—"పూర్వానికి వలె పోయి వంట చేస్తున్న భార్యను (జానకి వంటచేస్తూ వుంటుంది.) కోరిక ఉదయించటముతోనే కౌగిలించు కోటం చేయుటమా? ఈ జానకి ఎంత ఒరుగుపెట్టిన మధుపాత్రయో, అంత 'సీలు' చేసిన తేనెసీసా!", (ఆ 'సీలు'లోనే 'రొమాన్స్' స్వారస్యం అంతా వుందా యిరి!).... "జపమూలేదు. చట్టుబండలూ లేదు... ఆమె వడ్డిస్తున్నది. ఒక్కొక్క పదార్థమే చూస్తున్నాడు. పుల్లబచ్చలకూర పెసరపప్పులో వేసి వండింది. సన్నని వంకాయలు తెచ్చి పొట్ట చీల్చి కారం పెట్టి నేతిలో వేయించింది. దోసకాయ కాల్చి పచ్చిమిరపకాయలు కొతిమేర వేసి పచ్చడి చేసింది. గరిటెతో పులుసు తీసుకువచ్చింది. దూరానికే ఘుమాయిస్తున్నది... అబ్బా, ముప్పై ఏళ్ల తర్వాత మళ్లీ ఈ రుచి వచ్చిందే! ఇవి తనకు అమితప్రియములైన వస్తువులని ఈమెకు జ్ఞాపకం ఉన్నదే!... పులుసు స్వర్గానికి బెత్తెడెడంగా వుంది..." "మానవులలో వయస్సు వేరు, ఆరోగ్యం వేరు, పిండపుష్టి వేరు. ఈ లక్షణాలచేత శాస్త్రి వయస్సరవైయేగాని అతడు వృద్ధుడనటానికి వీలులేదు... భార్య చనిపోవటమనేది తన జీవిత సుఖం మీద గొడ్డంటి పెట్టు అనే భావం మాత్రం చెదరి పోకుండా జీవుడిలో ఉన్న పచ్చితనాన్ని నిలబెట్టటం మూలంగా ఒక బ్రతుకు బ్రతుకుతూ వచ్చాడు. అందు చేత మనిషి వృద్ధుడు కాలేదు. పటుత్వం పోలేదు. వయసు దాని పని అది చెయ్యటం మానివెయ్యనూ లేదు. పతివ్రతయైన జానకికి అతని యం దిదేమీ పట్టనూ లేదు.." ఈ సమావేశానికి పర్యవసానం: "జానకి శాస్త్రిని కౌగిలించి ముద్దుకొనెను." అరవై ఏళ్ల వృద్ధుని చిత్తవృత్తిని గురించి వ్యాఖ్యానించ

డానికి శ్రీ సత్యనారాయణగారికున్న అధికారం ఈ సమీక్షకునికి లేదు! ఇక్కడ గమనించవలసిన విషయం —నీలకంఠశాస్త్రిలో బలీయమైనవి ఇంద్రియ వాసనలే, విషయ వాంఛలే! 1. సెక్స్ 2. జిహ్వ. వీటికి ఉపకరణాలు కామినీ కాంచనాలు. ఆ రెండింటినీ రొమాంటిక్‌గా సాధిస్తాడు శాస్త్రి. ఆ సాధనలో బంధువులైన ఉద్యోగస్థుల పలుకుబడినీ అధికారాన్నీ వ్యక్తిగత ప్రయోజనాలకు ఉపయోగించుకోవచ్చునా? కార్యసాధనకు లంచం యివ్వవచ్చునా? అనే ధర్మసందేహం ఎక్కడా రాదు. శ్రీ సత్యనారాయణగారు సనాతన ధర్మవాది కావడంచేత కాబోలు నేటి సామాజిక నీతి నియమాలు ఆయన పట్టించుకున్నట్లులేదు. అందుకే వాటిని గూర్చి చర్చలేదు. చచ్చిన భార్య మళ్లీ బ్రతికి వస్తే ఆమెను తాకాలా? వద్దా? అనే విషయాన్ని గూర్చి మాత్రం పేజీలు పేజీలు చర్చించారు.

'పునర్జన్మ' ఒక అరవై ఏళ్ల మగవాని 'రొమాన్స్'.— ఆడదాని రొమాన్స్‌కాదు! (అసలు ఆడదానికి రొమాన్స్ ఏమిటీ?) నీలకంఠశాస్త్రే మరణించి వుండి ఇరవై ఏళ్ల యువకుడుగా యాభై ఏళ్ల జానికమ్మ ఎదుట సాక్షాత్కరిస్తే, ఇద్దరూ ఒకరినొకరు భార్యాభర్తలుగా గుర్తిస్తే, ఆ 'రొమాన్స్' ఎలా వుంటుందో ఊహించుకోవాలి! ఏం? ఎందుకు వీలులేదు? జానకికి సిద్ధించిన 'ఏకాగ్రత' నీలకంఠ శాస్త్రికి అక్కరలేదా? సిద్ధించటానికి వీల్లేదా? అప్పుడు శ్రీ సత్యనారాయణగారి సమర్థనలూ వివరణలూ ఏమౌతాయి? దీనికి ఆయన సమాధానం— భగవంతుని లీల అలా వుండదు! అని కాబోలు. ఇదే కాల్పనికవాది (Romanticist) యొక్క విలక్షణమైన దృక్పథం. తనకు ధర్మంగా, తన మనస్సుకి అందంగా, సవ్యంగా, ఉదాత్తంగా ఉన్నదే సత్యం, లేనిది అసత్యం! శ్రీ సత్యనారాయణగారి ఆధ్యాత్మికత కాల్పనికవాద దృక్పథంతో పెనవైచుకుని పోవడమే అది వివాదగ్రస్త విషయం అవుతూ వుండటానికి ముఖ్యహేతువు. ఆయన రచనలన్నీ పూర్తిగా ఆత్మాశ్రయాలే! వాటిలో ఆయన మూర్తి స్ఫురిస్తూ వుంటుంది. నీలకంఠశాస్త్రి 'రొమాన్స్'లోనూ ఆయనే కనిపిస్తారు.

## కృష్ణశాస్త్రి కృతులు

[1. పుష్పలావికలు. 2. అప్పుడు పుట్టివుంటే 3. బహుకాల దర్శనం. ఒక్కొక్కటి వెల: రు.3— ప్రచురణ: విశ్వోదయ, కావలి.]

కృష్ణశాస్త్రి కాల్పనికోద్యమానికి (Romantic Movemnt) చెందిన ప్రముఖ కవేకాదు, చక్కని వచన రచయిత కూడా. కాల్పనిక కవిత్వ సౌరభము ఆయన వ్యాసాల్లోనూ ఉంది. ఈ సంపుటాలు ఇంగ్లీషులో (Belles- letters) ('సుకుమార సాహిత్యం' అని తర్జుమా చేయవచ్చునేమో) అనబడే తరగతికి చెందుతవి.

'పుష్పలావికలు'— 'మేఘ సందేశాన్ని', రాయల నాటి నాగరకతనూ, ప్రబంధ సాహిత్యాన్ని నెమరు వేస్కుంటూ అరమోడ్పు కనులతో తన్మయతను పొందడం. 'సువాసన ద్రవ్యాలు'— అంతే. 'కోవెల— కొలను', 'మా వూరు పోయింది', 'మా ఊళ్లో వీధి అరుగు' — కాలగతిలో మాటుపడిన— తెలుగు పల్లెటూళ్ల అందచందాలను, తీరుతీయాలను, మరపురాని మనుష్యుల్ని తీయగా హాయిగా జ్ఞాపకం తెచ్చుకోవడం. 'శ్రీ కృష్ణావతార తత్త్వము', 'గుహుడు' —పురాణ పాత్రల వైపు భావనని మళ్లించడం. 'మలుపు తిరిగితే' — జీవిత వైచిత్రిని గూర్చి చక్కని వ్యాఖ్యానం. కృష్ణశాస్త్రిగారి ఈ వ్యాసాల్ని చదువుతుంటే ఆంగ్ల సాహిత్యంలో ఛార్లెస్ లాంబ్ (Charles lamb) వ్రాసిన వ్యాసావళి 'Essays of Elia' జ్ఞాపకం వస్తుంది. ఆర్ష కావ్యాల్లో మనకు పరిచితమయ్యే లోకాన్ని గురించీ వ్యక్తుల్ని గురించీ వూహలల్లుకొని తన్మయుం చెందడం, చిన్ననాడు ఎరిగున్న పరిసరాల్నీ మనుష్యుల్నీ ఆప్యాయంగా వర్ణిస్తూ ఒక మధుర భావాలోకంలో విహరించడమూ — లాంబ్‌కీ కృష్ణశాస్త్రికీ వ్యాసకర్తలుగా గల చక్కని సామ్యం! తెలుగు సాహిత్యంలో 'కాల్పనికత' ప్రధానంగా గల వ్యాసాలు అరుదు. కృష్ణశాస్త్రి వ్యాసాలు ఆ కొరత తీర్చాయి.

'అప్పుడు పుట్టివుంటే' — సాహిత్య విమర్శ ప్రధానమైన వ్యాసాల సంపుటి. 'ఏకాంతసేవ',

'షష్టిక సంవత్సరాల తెలుగు కవిత్వము', 'బసవరాజు అప్పారావు మధుర స్మృతి' అనేవి తెలుగులో నవ్యకవిత్వోద్యమాన్ని, ఆ ఉద్యమంలో ప్రముఖులైన కవులతో కృష్ణశాస్త్రికి గల సంబంధాన్ని వివరిస్తాయి. ఈ వ్యాసాల్లో నిర్దిష్టమైన కవిత్వ విమర్శకంటె, సాహితీ సమితి పుట్టుపూర్వోత్తరాలను గురించి శాస్త్రిగారు 'నెమరు వేసు'కోవడమే ఎక్కువపాలు. తెలుగు సాహిత్య భవితవ్యాన్ని ఊహిస్తూ (1948 లో) శాస్త్రిగారు చెప్పిన రెండు అంశాలు గమనింపదగినవిగా ఉన్నాయి. "యౌవన దశలో నుంచి జాతి పెరగడం వల్ల కవిత్వ యుగంలో నుంచే నాటకాల యుగంలోనికి సాహిత్యం ప్రవేశిస్తుందేమో!" (24 పుట)......"మనదేశంలో కవికి సమష్టి ప్రజా జగత్తు దూరదూరాల నుంచి 'మరో ప్రపంచం' లాగే కనపడుతుంది, కాని సన్నిహితమైన ఆప్తానుభూతిలాగ పలకరించడం లేదేమో! కొంత వరకు ద్రష్ట అయిన కవి అంచుల చూస్తున్నాడు, కాని అందులోని వాడు కాలేదు. కవిత్వానికి కొంత ఆత్మీయత, ఆత్మపరత కావాలేమో!" ఈ యిరవై ఏళ్లలో జరిగిందేమిటంటే కవిత్వయుగంలో నుంచి సాహిత్యం నాటకాల యుగంలోనికి కాదు, నవలా యుగంలోనికి ప్రవేశించింది. తద్వారా ద్రష్ట అయిన రచయిత 'ఆత్మీయత'ను, 'ఆత్మపరత'ను వేషముగా కాక చిత్తశుద్ధితో అల వరచుకోవలసి వస్తున్నది. సాహిత్యంలో యీ కొత్త నీళ్లు, వరద తగ్గి నిర్మలం కావడానికి యింకా కొంతకాలం పట్టవచ్చు. చివరిది 'అన్నమాచారి' — తిరుపతిలో అన్నమాచార్యుల వర్ధంతికి రచించిన ప్రసంగ వ్యాసం. సభ దిగువతిరుపతిలో జరిగింది. కృష్ణశాస్త్రిగారు తన వ్యాసాన్ని చదవ లేక శ్రీ రజనీకాంతరావుని చదవ మన్నారట. వ్యాసంలో చివరి మాటలు — "నాకు తిరుమలకు మరో విధాన రావాలని ఉంది... నేను ఏడు కొండలూ మోకాళ్లక్క సాగాలి. స్వామి కొలువులో ఒక మూల ఒదిగి నిలబడాలి.... నీవు నా కోసం ఏమి తెచ్చావు, అని నా ప్రభువు నా వైపు చేయి చాపాలి. రంగు రంగుల ధూళితో శబలితమైన నా జోలెలోని బరువులు అయిన పాదాలముందు కుమ్మరించ బోవాలి. అలాగ కుమ్మరించడ మేమిటి — 'కదలునెవో మరల నా యెదలో ఒత్తిలి గీతులు, నిదురించే పులుగు గూట విదిచే రెక్కలవోలె!' అప్పుడు ప్రభువు అనుజ్ఞ నివ్వాలి. నాకు గొంతు పూర్తిగా రావాలి. నా స్వామిపై ఒక్క ప్రభాత మంగళగీతం పాడాలి...." సభ అయ్యాక, భార్య కొండపైకి వెళదామంటే వెళ్లలేదుట. గొంతు నొప్పితో బాధ పడుతూ మద్రాసు వెళ్లారు. అక్కడ ఆపరేషన్ జరిగింది. కృష్ణశాస్త్రి గారి గొంతు మూగ పోయింది. ఈ ఉదంతం శాస్త్రిగారే ఈ సమీక్షకునితో చెప్పారు. (పలకమీద వ్రాసి చూపారు). భగవంతునితో పరిహాసమాడారా శాస్త్రిగారు? ఆయనకు కోపం వచ్చిందా? "ఏ గుడ్డిదో, కుంటిదో విశ్వాసమే మేలు అవిశ్వాసం కన్న. నేటి అవిశ్వాసికి తీర్చిన మార్గం లేదు. చేరుకొనే గమ్యస్థానం లేదు." అన్నారు శాస్త్రిగారు ఈ వ్యాసంలోనె. వ్యాఖ్యానం అనవసరం.

'బహుకాల దర్శనం' సంపుటిలో పాత్ర చిత్రీకరణ ప్రధానమైన రచనలు, రేడియోకోసం వ్రాసినవి, ఏడు ఉన్నాయి. 'బహుకాలదర్శనం' అనే మంత్రాన్ని జీవనోపాధి సూత్రంగా పఠించే శ్రీరాములు పాత్ర, తిరునాళ్లలో తప్పిపోయిన సుబ్రమ్మణ్య పాత్ర, నవాబు దర్జాకు లోటులేని రిక్షావాలా అహమ్మద్ పాత్ర, చెప్పులు కుట్టే నారయ్య పాత్ర, బహు సున్నితంగా తీర్చిదిద్దారు శాస్త్రిగారు. శాస్త్రిగారు నేటి సాహిత్యధోరణి కనుగుణంగా ఒక నవల వ్రాస్తే చదవాలని ఉంది. అది ఒక మధుర స్వప్నం. స్వప్నం ఫలిస్తుందా? వేచి ఉందాము.

—ఆర్. ఎస్.

## వ్యా స వా హి ని

[రచన: శ్రీ పి. నారాయణ రెడ్డి. ప్రతులకు: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, సికింద్రాబాదు, మచిలీపట్టణం. మూల్యము: రు 2.50.

డాక్టరు నారాయణ రెడ్డిగారు 'అప్పుడప్పుడు వ్రాసిన వ్యాసాలు, చేసిన ఆకాశవాణి ప్రసంగాలు' ఈ వ్యాసవాహినిలో ఉన్నవి. ఇందులో 'కొన్ని

సాహిత్య విద్యార్థులకు ఉపయుక్తమైనవి. కొన్ని సరదాగా చదువుకోవడానికి యుక్తమైనవి' అని శ్రీ నారాయణ రెడ్డిగారే చెప్పుకొన్నారు. అయితే ఏవి సాహిత్య విద్యార్థులకు, ఏవి సరదాకు అన్న సంగతి విచారించుకొనుట పాఠకుల పనిగా చేసి రచయిత తప్పుకొనుట చాల గడుసైన పని.

ఈ సంపుటములో మొత్తము పది శీర్షికల రచనలున్నవి. ఈ పదింటిలో ఏవి వ్రాసిన వ్యాసములో, ఏవి ఆకాశవాణి ప్రసంగములో కూడ రచయిత చెప్పలేదు. ఏ వ్యాస మెప్పుడు వ్రాయబడినదో, ఏ ప్రసంగ మెప్పుడు ప్రసారము చేయబడినదో కూడ రచయిత సూచింపలేదు. లేదనగా ఉండవలయునన్న మాట.

రచనల యొక్క ధోరణిని పట్టి చూడగా 1. నన్నెచోడుని కవితాశక్తి 2. ద్విపదలలో దివ్య కవిత 3. తిక్కన తీరు తెన్నులు అను మొదటి మూడును వ్యాసములుగా వ్రాయబడినట్లును— 4. రంగనాథరామాయణం 5. తెలుగు కావ్యాలలో సాంఘిక జీవితం— శుకసప్తతి, హంసవింశతి, చాటువులు 6. భవిష్యత్తులో కవిత 7. శబ్దశక్తి— అర్థస్ఫూర్తి 8. నిత్య జీవితంలో వేమన 9. రవీంద్రుని కవితలో విశ్వజనీనత 10. నాయుడుబావ అను తరువాతి ఏడును ఆకాశవాణి ప్రసంగము లయినట్లును అనుమానింప వచ్చుననిపించుచున్నది.

నన్నెచోడుని కవితాశక్తిలోని అంతర్భాగములుగా కల్పనా శక్తి, పరిశీలన శక్తి అను రెండును సోదాహరణముగా చూపబడిన, వ్యాఖ్యానింపబడిన, మెచ్చుకొనబడిన మొదటి వ్యాసము,— సోమన గారనల ద్విపదకృతులలోని వర్ణనా చమత్కార సందర్భముల యుటంకింపుతోడి ప్రశంసామయత్వమున తీగసాగిన రెండవ వ్యాసము,— విరాటోద్యోగపర్వములలోని తిక్కన్నగారి ప్రసిద్ధ రసవద్రచనా రమణీయత కేతము త్రొక్కబడిన మూడవ వ్యాసము, శాశ్వతమైన మానవ స్వభావపు దుష్టాంధకోణములకు నయ భయ హేళనా వాఙ్మయ దీపికల నెత్తిన వేమన్నగారి వివేకమును ప్రదర్శించు ఎనిమిదవ వ్యాసము శ్రీ నారాయణరెడ్డిగారి కవి బుద్ధియొక్క కవిత్వానుభవ భావానంద భరితత్వమునకు ముఖ్యమైన ఉదాహరణములుగా నున్నవి. తెలుగు కావ్యాలలో సాంఘిక జీవనమున్న శీర్షికను పరామర్శింపబడిన శుకసప్తతి, హంసవింశతి, చాటువులు శ్రీ రెడ్డిగారి పరిశీలన శక్తిని, శ్రద్ధను చాటుచున్నవి మొత్తము మీద ఈ సంపుటములోని వ్యాసము లన్నియు కవితాత్మబలమధికముగా గల వ్యక్తి అన్యుల కవిత్వమున కభిముఖుడై పొందిన యనుభవ విశేషమును లెస్సగా నిరూపించు చున్నవి.

ఈ వ్యాసముల యందు శ్రీనారాయణరెడ్డిగారి వాక్యరచనా ఫక్కిక రూపకానుప్రాసానుప్రాణితమై వింత సొగసును సంతరించుకొని ప్రత్యేకముగా కనిపించు చున్నది. మరియు నాయన నవీన మార్గ కవియగుట మూలముగా నెడనెడ ఆధునికోపముల తోడను, ఆంగ్లానువాదపు పలుకుబడుల తోడను ఉండి వచనశైలి ప్రత్యేకతతోపాటు చిత్రరమణీయత నలవరించుకొని సొగసుగా నున్నది. ఆధునికాంధ్ర వాఙ్మయ విమర్శనములో ప్రవేశింపదగిన "వాక్చిత్రము — సమాసచాలనము — కుడ్య చిత్రము: — చలనచిత్రము—సంభాషణచాలనము— రాకెట్టువేగము— ఎత్తు ఎగురు— ఊపిరి పోసుకొను"— మొదలైన మాటలను శ్రీ నారాయణ రెడ్డిగారు తమ రచనలలో ప్రవేశపెట్టియు తమ శైలికి నూత్నత్వమును సంపాదించు కొన్నారు.

కవిత్వ సిద్ధాంతమునకు సంబంధించిన యభిప్రాయములను చెప్పు వాక్యము లీ వ్యాసములలో అక్కడక్కడ చెదురుగా వెదజల్లినట్లున్నవి. సాహిత్య విద్యార్థులా వాక్యముల నొకచో చేర్చి పరిశీలించుకొన్నచో శ్రీ నారాయణరెడ్డిగారి పల్లవదశ నుండి పంటకెదిగిన సాహిత్య వ్యక్తి బోధపడును. ఆయనలో జీర్ణించిన సంప్రదాయము నుండి పరిణమించిన నవ్యత గోచరించును.

ఈ వ్యాసములు చదివిన తరువాత ఆయా కృతులను చదివిన వారికైనను తిరిగి చదువ వలయు ననిపించును. కవియైన శ్రీ నారాయణరెడ్డి తన ప్రాచీన కవుల విషయమునిట్లు వివరించి చెప్పి పాఠకుల నటు మళ్లించుట సభినందింప వలయును.

—క్షేమేంద్ర.

## ప్రేమకు పగ్గాలు

[రచన: శ్రీ పీరాజీ, ప్రచురణ: యం. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు—1. వెల: రు. 3—50.]

ప్రేమ ఒక బంధనంగా అనుభవంలోకి రావడం ఈ నవలలో ముఖ్య వస్తువు. ప్రేమకి పగ్గాలున్నాయి, వుంటున్నాయి, వుంటాయి అని రచయిత చెప్పదలచుకున్నాడు. దాన్ని ఈ కథ ద్వారా నిరూపించడం జరిగింది. ఇందులో ప్రేమలో చిక్కుకొన్న పిన్న ప్రాయపు పాత్రలందరూ ఉన్నత విద్య నభ్యసిస్తూ వున్నవారే. భాస్కరం పద్మావతిని ప్రేమించాడు. ఆ అమ్మాయి అతనిపై తనకు సర్వహక్కులూ ఏర్పడ్డాయనీ, మరొక అమ్మాయి అతనితో మాట్లాడ్డమే పనికిరాదనీ అన్న అహంతో వుంది. అయితే భాస్కరం తన చెల్లెలి పెళ్ళి సమంధం నిశ్చయం కావడంకోసం సురేఖ అనే అమ్మాయిని పెళ్ళిచూపుల తంతులో చూడటం జరుగుతుంది. చెల్లెలంటే సవతి తల్లి కూతురు. సవతి తల్లి జానకమ్మగారు అతన్ని తల్లికంటె మిన్నగా చిన్నతనం నుంచీ పెంచింది. ఆ తల్లి కొడుకు లిద్దరూ ఒకరిని ఒకరు వదులుకోలేరు. పైగా తాను భాస్కరానికి కన్నతల్లిని కాదు, పిన్నిని అనే భావం ఆమె అంతరాంతరాలలో వుండి, అతని పట్ల ఆమె అధిక శ్రద్ధను, ఆందోళనను కనపరుస్తుంది. భాస్కరం కూడా 'పిన్నీ, నువ్వు పెద్దదానివైనా కాకపోయావే' అనుకుంటాడు. పైగా భాస్కరం కూడా ఇతర కుర్రాళ్ళకిమల్లే ప్రేమించగలడని జానకమ్మ తెలుసుకోలేదు. అతనికి ఇరవై అయిదేళ్ళు వచ్చినా ఆమె దృష్టిలో అతనింకా ముక్కుపచ్చలారని వాడే. అతని ఎదో ఏటినుంచే వ్యక్తిత్వం ఎరగకుండా అతన్ని అదుపు చేసింది. తనకూతురు పెళ్ళి అయి ఆమె కాపరం సవ్యంగా జరగాలంటే భాస్కరం సురేఖను చేసుకోవాలన్నది. కాని భాస్కరం తన ప్రేమ సంగతి ఆమెకు చెప్పడు. తానొక అపరాధంచేసినట్లు దాచుకుంటాడు. చెప్పనా వద్దా అన్న డైలమ్మాలలో పడతాడు. ఈ డోలాయమానస్థితితో కథ కొన్ని అధ్యాయాలు సాగుతుంది. వాటిలో ప్రేమికుల మానసిక సంక్షోభాన్నీ, వారి వైఖరులనూ రచయిత విశదపరిచే అవకాశం కలిగింది. భాస్కరం నిజంచెబితే కథ ఎప్పుడో సమాప్తమయ్యేది. కాని ఎటూ తేల్చుకోలేడు. చెల్లెలు పెళ్ళి సమంధాన్ని చెడగొట్టుకో లేడు. పిన్ని జానకమ్మను దుఃఖపెట్టడం చేతకాదు. "నేను నిన్ను ప్రేమించడం వల్ల నా పిన్నికి కష్టం. నా చెల్లికి పెళ్ళి అవదు. నీ కుటుంబానికి గల అప్రతిష్ఠ ఒక అడ్డు" అని పద్మావతితో చెప్పలేక పోతాడు. చెప్పేస్తే ఆమె ఏమవుతుందోనన్న పిరికితనం లోపల వుంది. ఈ విధంగా భాస్కరం ప్రేమకు పగ్గాలు పడ్డాయి. తనను చేపట్టడంలో భాస్కరానికి ఎన్ని చిక్కులున్నాయో పద్మావతి తెలుసుకోలేదు. పరిస్థితిని అపార్థం చేసుకొంటుంది. ఆమె యాతనను తల్లి అర్థం చేసుకొని పెళ్ళి ప్రయత్నాలు చేస్తుంది. వరుని వెదుకుతుంది. కాని పద్మావతికి అవన్నీ ఇష్టం లేదు. తాను చదువుకోసమని ఇంత దూరం వచ్చి భాస్కరంతో ప్రేమలో చిక్కుకున్న వ్యవహారాన్ని తల్లితో చెబితే ఎంతో మమకారంలో ఆపేక్ష అంతా తన మీదే పెట్టుకొని పెంచి చదువు చెప్పిస్తూవున్న తల్లి ఏ అఘాయిత్యానికి పాల్పడుతుందోనని పద్మావతి భయపడి తన ప్రేమ సంగతి తల్లికి చెప్పదు. అటు సురేఖను దొడ్డమ్మ ధనమ్మగారు ముద్దుగా పెంచి చదువు చెప్పిస్తోంది. మరి దొడ్డమ్మగారు నిశ్చయించిన భాస్కరాన్ని చేసుకోవడానికి ఆ పిల్లకూ కొన్ని ఆటంకాలు వచ్చాయి. ఆమెకు భాస్కర మంటే ఇష్ట మున్నప్పటికీ, భాస్కరం పద్మావతుల ప్రణయం సంగతి తెలిశాక తన ప్రేమకు తానే పగ్గాలు వేసుకుంది. ఎందుకూ అంటే పద్మావతిపై తనకు ప్రేమవల్ల. ఆమెకు అన్యాయం చేయలేక. అంటే ఇతరులను సుఖపెట్టడం కోసం తన అన్ని కోర్కెలకూ బంధనాలు వేసుకొంది. ఈ విధంగా భాస్కరం ప్రేమకు పిన్నిగారి వాత్సల్యం, పద్మావతి స్వేచ్ఛకు ఆమె తల్లి మమకారం, సురేఖ చర్యకు ధనమ్మగారి అనురాగం బంధనాలయ్యాయి. వారు బందీలవుతారు. పెద్దల కోర్కెలు, ఉద్దేశాలు వేరు, పిన్నల ఆశలు ఆశయాలు వేరవుతాయి. దీనితో సంఘర్షణ సంభవిస్తుంది. పెద్దలు తాము భంగపడ్డట్టే భావిస్తారు. పిన్నలు తమ ఇష్టానుసారం పోవడానికి

వీలులేకుండా వుందని బాధపడతారు. ఈ సంఘర్షణను రచయిత ప్రతిభావంతంగా చిత్రించారు. కాని కథ ముగింపు స్పష్టంగా లేదు. అసలు కథా నాయకుడైన భాస్కరం పిన్ని జానకమ్మగారి అకస్మిక మరణంతో దుఃఖంలో మతి తప్పిన వానికి మళ్లీ ఉన్న స్థితిలో పద్మావతి ఆ ఇంటికి ఆడ దిక్కు తానే అని భాస్కరం తండ్రి సుబ్బారావు గారు వద్దన్నా అక్కడేవుండి పోతుంది. దీనిని రెండు విధాలుగా పాఠకులు అర్థంచేసుకొనే ప్రమాదం వుంది. మరో విధంగా అర్థంచేసుకున్న వారు అసంతృప్తి చెందక తప్పదు. కథలో నాటకీయమైన సన్నివేశాలు కొన్ని వున్నాయి. పద్మావతి పెళ్లి పందిరి నుంచీ కోపంతో రైలు స్టేషనుకు వెళ్లి పోవడం, భాస్కరం జానకమ్మ గారితో సురేఖను తాను పెళ్లాడలేనని చెప్పిన సందర్భం, భాస్కరం మరో అమ్మాయిని ప్రేమించాడు దొడ్డమ్మా అని సురేఖ ధనమ్మగారికి చెప్పిన ఘట్టం వంటివి. మమతలు, అనురాగాలు, స్నేహాలు, సంఘంలో స్థాయి, అంతస్థు, పెద్దల చరిత్ర, కుటుంబాల సంప్రదాయాలు— ఇవన్నీ, లేక వీటిలో ఏది ఒకటైనా ప్రేమకు పగ్గం వేయగలదని చెప్పే నవల ఇది. ఈ రీత్యా దీనికొక ప్రత్యేకత వుంది. రచన అధ్యాయాల వారీగా ఒకఫక్కీలో సాగింది.

రచయిత సరిగ్గా తాను ఊహించినట్లే, వచ్చిన మాట వచ్చినట్లే వ్రాయడంవల్ల అక్కడక్కడా వాక్యాల క్రమం అదొక తీరుగా వుండి, పాఠకుడు ఒకటికి రెండు మార్లు ఆ వాక్యాలను పరిశీలన చేసి అర్థం చేసుకోవలసిన అగత్యం కలుగుతుంది. ఉదాహరణకు "భాస్కరం తాను వెళ్లలేక పోతే చిన్నబోవచ్చు" (అంటే తాను వెళ్లలేక పోతే భాస్కరం చిన్న బోవచ్చునన్న మాట). "పద్మావతి గారిని శైలజ విన్న సురేఖ గురించి అడిగిందట" (శైలజ విన్న పద్మావతి గారిని సురేఖ గురించి అడిగిందట.) ఇత్యాదులు. భావాల తీవ్రత వల్ల వ్యక్తీకరణలో ఇలా క్రమం పడిపోతుంది. ఏమైనా ప్రత్యేకత గల పాత్రలు, విశిష్టమైన వైఖరులు, ప్రస్ఫుటమైన సంస్కారం, పట్టు వున్న సన్నివేశాలు, యథార్థాన్ని వైవంతో చెప్పడమనే తీరుగల ఈ నవల మొదట ఆంధ్ర సచిత్ర వారపత్రికలో వెలువడి ఇప్పుడు ఇలా పుస్తక రూపంలో రావడం తెలుగు నవలా సాహిత్యానికొక సొంపు అని చెప్పాలి.

—వాణీకుమార.

## వెలుగుబాటలు

[వనితాలోకం వ్యాసాల సంపుటి. రచయిత్రి: శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి. ప్రచురణ: యం. శేషాచలం అండ్ కంపెనీ. మద్రాసు, మచిలీపట్నం, సికిందరాబాదు. ప్రాప్తిస్థానం: ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు. రాష్ట్రపతి రోడ్డు, సికిందరాబాదు. పేజీలు 180. వెల: సాదాప్రతి రూ. 3.00. మేలి ప్రతి రూ. 4.00.]

స్త్రీలూ పురుషులూ సమానులు, ఏ రంగంలోనూ స్త్రీ పురుషుడుకంటే తీసిపోదు, అందుచేత స్త్రీ పురుషులకు హక్కులు సమానంగా వుండాలని అందరూ అనటం వినటం పరిపాటే అలవాటూను. ఈ వ్యాసాలలో ఆ భావ వ్యక్తీకరణ వుంది.

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి స్త్రీలు అభివృద్ధి చెందాలనీ, వారికి సర్వ సంక్షేమాలు కలగాలని, భావస్పందనతో, ఆశయంతో వ్రాసిన ఈ వ్యాసాలలో శారీరకంగా మానసికంగా సామాజికంగా సర్వ రంగాలలో స్త్రీ ఎలా అభివృద్ధి చెందాలో, సమాజాన్ని ఏ రీతిగా నడిపించాలో చూపిన తీరు, ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ధారావాహికంగా ప్రచురింపబడినప్పుడు ప్రజాదరణ పొందింది.

స్త్రీలు ఆరోగ్యంగా వుండాలి. సమాజాభివృద్ధిలో భాగస్వాములు కావాలి. కనుక సూరత్ నివాసి అయిన స్త్రీలాగా ఆరోగ్యం కాపాడుకోవాలి. ధోండోకేశవ కార్వే పండితుడులాగా పురుషులంతా స్త్రీలకు చేయూతనివ్వాలి. అభివృద్ధి పథంలో నడిపించాలి.

స్త్రీ భోజన విషయంలో అశ్రద్ధ చేయరాదు. తక్కువ ఖర్చుతో ఎక్కువ పుష్టిని ఇవ్వగల బహ్వర్థ సాధకాహారం గూర్చి వంట ఇంటి విశేషాల చర్చ తగు మాత్రంగా వుంది. క్లిష్టర్సు

క్లింటస్ అనే హోటల్ యజమాని తయారు చేసిన అధిక పుష్టినిచ్చే అల్ప వ్యయాహార విషయం ప్రస్తావించి, బెంగుళూరులో అటువంటి ఆహారం తయారు చేస్తున్న వార్తను ప్రకటించి, శాకాహారులకు ఆకుకూరలు, కూరగాయలు, పప్పు కూరలతో పుష్టికరమైన ఆహారం ఎలా తయారు చేసుకోవచ్చునో, దాని ప్రస్తావన వుంది.

తిన్న తిండి జీర్ణం కావటానికి క్రీడలు అవసరమే! ఇన్‌డోర్ గేమ్స్ వల్ల ఆ విధమైన వ్యాయామం స్త్రీలకు కలుగుతుంది. అసలాలా మంచివే! శరీరారోగ్యం ఉన్నంత మాత్రంతో సరి పోదు. మానసికారోగ్యం కూడా తప్పనిసరే! స్త్రీలు చదువురానివారు, చదరంగం వంటి ఆటల మూలంగా మనస్సుకు పదును పెట్టుకోవచ్చు.

ఆరోగ్యవంతురాలయిన స్త్రీ, సంతానం దేశానికి ఆరోగ్యం కలిగిస్తుంది.

పిల్లల్ని పెంచుకోవటంలో జాగ్రత్త వహించాలి. తగిన పోషణ, ఆదరణలేని పిల్లలు అల్లరి వారై, విచ్చలవిడిగా తిరిగి పాడయి పోతారు. దేశానికి, తల్లిదండ్రులకూ కళంకం తెస్తారు. పిల్లల్ని కనిపెట్టి వుండాలి. వాళ్లకూ ప్రత్యేక వ్యక్తిత్వం వుందని గుర్తించాలి. చులకనగా చూడకూడదు. హేళన చేయకూడదు. మనస్సు నొప్పి కలగకుండా ప్రవర్తించాలి. పిల్లల జయాప జయాల పట్ల ఆతురత కనబరచి, ఆధిక్యం ఫరవా లేదు కానీ అనాధిక్యం చూపింపకూడదు. ఇక్కడ రచయిత్రి భారతదేశ పరీక్షా విధానంపై కూలంకష చర్చానంతరం ప్రకటించిన వ్యక్తిగతాభిప్రాయం గమనార్హం.

బాలల అభివృద్ధికి జాగరూకత వహించాలి దేశం. పసిపాపల సౌభాగ్యంపై దేశ సౌభాగ్యం ఆధారపడి వుంది. పాశ్చాత్య దేశాలలో బాలబాలికల పట్ల చూపబడే జాగ్రత్త భారతదేశంలో కొరవడింది. ఈ వ్యాసాలలో అధిక సంతానాన్ని గూర్చి కానీ, కుటుంబ నియంత్రణ గూర్చి కాని రచయిత్రి చర్చింపలేదు.

స్త్రీకి విద్య అవసరమే! అందుకనుగుణంగా ఆ రంగంలో కృషి జరుగుతూ వుంది. అయితే సహవిద్యపట్ల రచయిత్రి అభిప్రాయం స్పష్టంగా లేదు కానీ, ధ్వన్యాత్మకంగా భారతదేశంలో సహవిద్య అనవసరమే అనే భావన ద్యోతకమవుతుంది.

దేశంలో పురుషు లెంతమంది ఉన్నారో దాదాపు అంత మంది స్త్రీలు ఉన్నారు. సహవిద్య వల్ల కల్గే నష్టాలకంటే సహవిద్య లేకపోవటం వల్ల కల్గే నష్టాలే ఎక్కువ.

సహవిద్యలో యువతీయువకులు పరస్పరం అర్థం చేసుకొనే అవకాశం వుంటుంది. వివాహానికి పూర్వం యువతి యువకుడితో మానసిక సామీప్యం ఏర్పరుచుకోక పోతే, హార్దిక సాహచర్యం, కలిసి జీవించటానికి తగిన వాతావరణం వుండక పోవచ్చు.

సహవిద్య వున్న పాఠశాల, కళాశాలలో యువతులు ప్రవర్తించినంత సంస్కారయుతంగా, వ్యక్తిత్వ పాటిష్ట్యంతో ప్రత్యేక స్త్రీల కళాశాలలో చదువుకొన్న వారు నడుచుకోలేరు. విద్యార్థిదశలో యువతీయువకులు ఒకరికొకరు ఆంక్షలు, హద్దులు, అవధులు. సహవిద్య ఉన్న సంస్థలో విద్యార్జన ముగించిన యువతి జీవితంలో ప్రవేశించి సాధించిన విజయాలు, సహవిద్యలేని సంస్థలో చదువు ముగించిన యువతులు పొందలేకే పోవచ్చు.

సహ విద్యను గూర్చి ఇంతగా ఎందుకు వ్రాయవలసి వచ్చిందంటే రచయిత్రి స్పష్టంగా సహవిద్యను అంగీకరింపక పోవటమూ, వ్యక్తం చేసిన అభిప్రాయాలలో సహవిద్యకు వ్యతిరేక స్ఫూర్తి ధ్వనించటం కారణం.

దేశంలోని అంగవైకల్యం వున్నవారికి అవకాశాలు కల్పించాలని రచయిత్రి సూచన. వాళ్లు హెలెన్‌కెల్లర్ అంత గొప్పవారు కావచ్చు. ఈ విషయాలు చర్చించిన వ్యాసాలు ఆసక్తికరంగా వున్నాయి.

మేడమ్‌క్యూరీ విషయమాదిగా, మేడమ్ మేయర్ (బొంబాయిలో మేయర్‌గా 1956 లో ఎన్నికయిన స్త్రీ) వరకు పలువురు స్త్రీలు సాధించిన ఘనకార్యాల ప్రస్తావన చదవబుద్ధి కలిగిస్తుంది.

రచయిత్రి చక్కని భాషలో అభిప్రాయ వ్యక్తీకరణ చేసినా నిర్దుష్టమైన భాషలో చేయలేదు. భాషాదోషాలు, వాక్యదోషాలు, అనువాదంలా కనిపించే వాక్యాలూ చెదురు మదురుగా వున్నాయి.

స్త్రీల సమస్యలనూ— పరిష్కారమార్గాలను చూపించే ఈ వ్యాసాల సంపుటి పురుషులు చదవవచ్చు. స్త్రీలు కొని దగ్గరే వుంచుకోవచ్చు.

## రాగంలో రంగులు

[నాటికల సంపుటి. రచయిత్రి: శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి. ప్రచురణ: యం. శేషాచలం అండ్ కో. మద్రాసు, మచిలీపట్టణం, సికిందరాబాదు. ప్రాప్తిస్థానం: ఆంధ్రప్రదేశ్ బుక్‌డిస్ట్రిబ్యూటర్సు, రాష్ట్రపతిరోడ్డు, సికింద్రాబాదు. పేజీలు 176. వెల సాదా ప్రతి రూ 3. మేలు ప్రతి రూ 4.]

ఈ సంపుటిలో పన్నెండు నాటికలున్నాయి. ఒక నాటిక రాగంలో రంగులు. అదే పుస్తకమకుటమయింది. అయితే మొదటి పేజీలో రాగంలో రంగులు అని వ్యావహారిక రూపం వుంటే అట్టమీద రాగములో రంగులు అని గ్రాంథిక రూపం వుంది. ఇలా రెండు విధాల వుండటంలో రచయిత్రి ఇష్టం ఉన్నట్లు భావించనక్కరలేదు. ప్రచురణ కర్తలే అట్టమీద గ్రాంథిక రూపానికి కారణం కావచ్చు. ఎందుచేతనంటే యం. శేషాచలం అండ్ కో, యం. శేషాచలం అండ్ కంపెనీ అనీ, సికిందరాబాదు, సికింద్రాబాదు, సికింద్రాబాద్ అనీ, మచిలీపట్టణము, మచిలీపట్టణం, మచిలీపట్నం అనీ వేరు వేరు పుస్తకాలలోను, ఒకే పుస్తకం వేరు వేరు తావుల్లోనూ ప్రచురణకర్తలు గుర్తించో గుర్తించకో ముద్రిస్తున్నారు. ముచ్చటగా పుస్తక ముద్రణ చేయింపగల ఈ ప్రచురణకర్తలు ఇటువంటివి రాకుండా చూస్తే ఇంకా బాగుంటుంది.

ఈ పన్నెండు నాటికలలో ఏ నాటికా రంగస్థల ప్రయోగానికి అనుకూలంగాలేదు. కొన్ని నాటికలు ప్రసారార్థం ఉద్దేశించినవిగా కన్పిస్తాయి కానీ, ప్రసారశిల్పం మృగ్యం. ఆకాశవాణికి శిల్పం సంగతి అక్కరలేదు కదా! ఏనాటిక అయినా ప్రసారం చేయగలదు. ప్రయోగార్హత, ప్రసార శిల్పం లేకుండా నాటికలు వ్రాయటంలో రచయిత్రి అభిప్రాయం ఆలోచింపదగిందే!

ఒక వస్తువు, ఒక ప్రక్రియలో వ్రాయటానికి అనుకూల్యం కలిగి వుంటుంది. ఏ వస్తువు ఏ ప్రక్రియలో సూటిగా చెప్పే అవకాశాధిక్యం కలిగి వుందో నిర్ణయించుకొనే బాధ్యత రచించే వారి మీద ఆధారపడి వుంటుంది. కొన్ని నాటికలు కథానికలుగా వ్రాస్తే బాగా రాణించేవి. 'రాగంలో రంగులు' నాటిక కథగా వ్రాసి వుంటే తెలుగుదేశానికి ఒక ఉత్తమ కథ లభ్యమయి వుండేది.

ఏ రచనకయినా వస్త్వైక్యం ప్రధానం. వస్తువైవిధ్యం దోషంకాదు. వస్తు విస్తరణాధికతగానీ, వస్తు విపులీకరణకానీ తప్పుకాదు. గుణం కూడాను. కాని అనవసర విషయాలు ఇతివృత్తంతో జత చేయుటం వల్ల వస్తు గుణ పాటిష్ట్యం తగ్గిపోతుంది. కొన్ని నాటికలలోని ప్రారంభ సంభాషణలు వస్తు శోభకు ప్రధానంకాదు. ఉదాహరణకు 'పచ్చిను కాయలు'లో తారాబాయినీ, సులోచననూ పిలిపించిందాకా, 'మగమహారాజు'లో రంగా ఇన్సూరెన్సు ఏజన్సీ విషయందాకా, 'రాగంలో రంగులు'లో ప్రారంభంలో భార్యాభర్తల సంభాషణ, ఇత్యాది రచనా శిల్పం దృష్టితో అనవసరంగానే కన్పిస్తాయి.

వాస్తవికతను సృష్టించాలని రచయిత్రి అటువంటి ప్రారంభఘట్టాలు ఏర్పరచివుండవచ్చు.సహజంగా ఏ ఇద్దరు వ్యక్తులు కలిసినా, ప్రధాన విషయానికి ముందు అప్రధాన విషయాలు మాట్లాడుకోవచ్చు. సమాజంలో ఎంతో, ఎన్నో జరగవచ్చు. ఏ సృజనాత్మక రచన అయినా అన్నివిధాలా సమాజానికి ప్రతిబింబంగా వుండాలనేదీ సత్యమే! కానీ, సంఘంలో జరిగే అన్నిసంగతులు, ప్రతిబింబాలులాగా వుండవలసిన రచనల్లో వ్రాయటానికి వీలులేదు. ఈ

పరిమితిని, పరిధిని అతిక్రమించి, రచింప గల రచయిత గానీ, రచయిత్రిగానీ సాఫల్యం సాధింపగల్గుతారు.

సాహిత్యంలో సమాజంలోని సహజత వుండవచ్చు. సమాజంలోని వాస్తవికత ఉండవచ్చు. ఉండాలి. కాని, సమాజం ఉండకూడదు. సమాజ ప్రతిబింబం మాత్రమే ఉండాలి. సమాజ సహజత ఉండరాదు. సమాజంలోవుండేది ప్రతిబింబం మాదిరిగా వుండి సహజత కల్గివుంటే సాహిత్యమవుతుంది.

ఈ సంపుటిలోని ప్రతినాటికలో నాటకీయత వుంది. ఆ నాటకీయత పుష్కలంగా వుంది. మనస్తత్త్వం, భావం, సంఘటన, కథ, సంభాషణ, పరిణామంపొంది, మార్పుచెంది, మలుపు తిరిగినప్పుడు ఉత్పన్నమయ్యే నాటకీయత వుంది. సుసాధమైన నాటకీయత ధ్వస్తం కాకుండా నాటక పూర్ణంగా రచన సాగింపగలవారు విజయం సాధించిన వారవుతారు. ఈ రచయిత్రి, శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి ఈ నాటకీయతను సంపూర్ణంగా సాధించినట్లే!

వాతావరణ కల్పనలో రచయిత్రి సిద్ధహస్తురాలు. సాధారణంగా సంస్కృతాంగ్ల నాటకాల ప్రభావం తెలుగు నాటకాల మీద పడుతుంది. కాని, ఈ నాటికలపై ఆ ప్రభావాలు ఏమీలేవు. అచ్చమైన తెలుగు వాతావరణంతో, తెలుగు ఇతివృత్తంతో అన్ని అందాల తెలుగుదనం విలుపుకొన్న నాటికలు ఇవి.

నాటికలలోని వ్యక్తులు పరిచితులు మాదిరిగా వుంటారు. తెలుగువారిలో ప్రతినిత్యం కనిపించే పాత్రలు అవి. వేణు నిజంగా మగమహారాజే! సూర్యారావు వ్రాయటం ఏముందిలే అని వ్రాయలేని వాగ్విమర్శకుడు. గోపాలరావు రెండోభార్యతో గుండె చప్పుడు దాచుకోవటం—ఈ పాత్రలన్నీ— వీళ్లంతా తెలుగువాళ్లు. 'పచ్చీసుకాయలు' ఆడుతూ ఎచ్చులు చెప్పుకోనేవాళ్లు, అత్తల మాటలకు నోరెత్తలేక అవస్థలు పడేకోడళ్లు, నాలుగో సంతానం కూడా ఆడపిల్లే అయితే మండిపడే అత్తలు భర్తలు—ఇలా భార్యాభర్తలు, అత్తాకోడళ్లు, పిల్లలూ తల్లిదండ్రులూ అందరూ తెలుగువాళ్లే! ఈ నాటకలలోని ఎక్కువపాత్రలు తెలుగు వాతావరణంలో సజీవంగా జీవించినవే!

మునిమాణిక్యం—కాంతం, చింతాదీక్షితులు—వటీరావు, గుడిపాటి—పద్మావతి, నండూరి—ఎంకి, భారతంలో— సత్యభామ, వీళ్లతో 'కాంతమ్మగారి పేరంటం'లో చక్కని తెలుగు వాతావరణం సృష్టించి, సృష్టిలో స్త్రీపురుషుల మధ్య గాఢానురక్తికి చెప్పిన కారణం, కారణంకాదు రహస్యం—స్వయంగా తెలుసుకోవలసి వుంది.

ఈ నాటికలలో రచయిత్రి చూపిన విశిష్టగుణం, మనస్తత్త్వ పరిశీలన. ప్రతిపాత్ర మనః పరిణామం స్పష్టంగా చర్మితం. ఆ కారణంగా ఈ రచనలకు ప్రత్యేకస్థానం వస్తుంది. రచయిత్రికి ప్రత్యేక గౌరవం కలుగుతుంది. ఒకపాత్ర ప్రవర్తించిన పద్ధతిలో మరొక పాత్ర ప్రవర్తించలేదు. పాత్రల ప్రవర్తన దృష్టిలో ఆలోచిస్తే ప్రతినాటికా, మనస్తత్వ పరిశీలనకొక మచ్చు తునుక! 'రాగంలో రంగులు' మనస్తత్త్వ పరిశీలనకొక పరాకాష్ఠ.

నాటికలలో శృంగారం లేదు. ప్రేమ వుంది. సమర్పణ వుంది. జీవితం వుంది. ప్రేమభావం ఉండీ లేనట్టుగా సంసార పక్షంగా వుంది. హాస్యం కొంచెంగా, అత్యల్పంగా వుంది. తెలుగువాడి వాడిఆవేశం, తొందర, తంపుళ్లమారితనం, మూర్ఖత్వం, బేషజం ఉన్నాయి. తెలుగువారి, కష్టాలు, సుఖాలు, దిగుళ్లు, తృప్తి డాంబికాలు, దాపరికాలు, ఉన్నాయి.

పురుషపాత్రలలో ఉండే వైవిధ్యం కంటే స్త్రీ పాత్రలలో ఉండే వివిధత్వం ఎక్కువగా వుందీ నాటికలలో. పాత్రలు మంచివీ, చెడ్డవీను. మూర్ఖమైనవీ—కానివీను. తెలుగువారిపూర్ణ జీవితం చూపించే నాటికల సంపుటి 'రాగంలో రంగులు'.

భాష వ్యావహారికం. అక్కకక్కడా గ్రాంథిక భాషారూపాలు కనిపిస్తూంటాయి. జీవితానికి దగ్గరగా వచ్చిన ఈ సంపుటిలో "నీ చేతులు తామరతూండ్ల కంటే మెత్తగా వున్నాయి. నీ కంఠం శంఖం కంటే మిన్నగా వుంది. నీ ముఖము చంద్రబింబాన్ని వెక్కిరిస్తోంది. నీ నయనాలు కలువరేకుల కంటే సొగతేరి వున్నాయి. సుకుమార సుందరమయిన నీ శరీరము ముట్టుకుంటే మాసిపోదు కదా" వంటి వర్ణనలు బాధ కలిగిస్తాయి. చేతులు తామర తూళ్లతో పోల్చటం మెత్తదనం కోసమా? కంఠం శంఖంతో పోల్చటం ఏ గుణం చెప్పటానికి? మిన్నగావుంది అంటే ఎలా? ఇలాంటి ప్రశ్నలు పాఠకులకు కలిగితే, తమంతట తామే సమాధానం చెప్పుకోవలసి వస్తుంది.

నాగరికత ప్రబలి, తెనుగుదనం మరుగున పడుతున్న, మరుగు పరుచుకొంటున్న, ఈ కాలంలో, తెలుగు వాతావరణంతో, తెలుగు వ్యక్తులతో, తెలుగు జీవితంతో, త్రిగుణీకృతమైన నాటకీయత కలిగి వెలువడిన ఈ నాటికల సంపుటి చదువుకోవటానికి చక్కని పుస్తకం.

—మనోరాణి.

## విరిగిన కలలు

[నవల. రచన : శ్రీ జనమంచి రామకృష్ణ. ప్రచురణ, యం. శేషాచలం అండ్ కో, మద్రాసు, మచిలీ పట్టణం, సికిందరాబాదు. పేజీలు 150. వెల: రూ. 1—75.]

అతి సామాన్య విధానంలో రచితమైన ఈ నవలలో భార్య అనుమానానికి గురి అయిన భర్త సంచలించి పోయినప్పుడూ, అనూరాధను ఆనంద రావు భార్యగా కిరీటిరావు చూచినప్పుడూ, తను కిరీటిరావును కానని కిరీటిరావే క్రిటాఫ్‌గా కోర్టులో దోషిత్వం నెత్తిన వేసుకొన్నప్పుడూ ఉద్వేగంతో పాఠకుడు వూగిసలాడి పోతాడు.

అకారణంగా కిరీటిరావు ఇల్లు విడిచి పారి పోవటానికిగానీ, నేరం అనవసరంగా తలదాల్చటం గానీ వింతగా వుంటుంది. సమంజసంగా వుండదు. ఏ మనిషి ఏ సమయంలో ఎందుకు ఏవిధంగా ప్రవర్తిస్తాడో అర్థంకాదు. ఆ అర్థంకాని తనమే కిరీటిరావు. యువతరం అవ్యవస్థకు ఈ పాత్ర చక్కని ఉదాహరణ.

అతను నటుడు — మహానటుడు, చిత్ర కారుడు. నృత్యం చేయగలవాడు. రచయిత. ఇంకా అనేకమైన మంచి లక్షణాలు ఉన్నవాడు. అటు వంటి వ్యక్తి పతనమైపోతే చివరకు సానుభూతి కలుగు తుంది. కోపం వస్తుంది. దిగులుగా వుంటుంది. నవల ముగింపు మేఘావృత తటిల్లతలా వుంది.

చివరకు అనూరాధ పట్ల కలగవలసినంత జాలి కలగదు. తనెరుగని నిందకు గురి అయిన శోభ కిరీటిరావును రక్షించాలని వచ్చి విఫల మనోరథంతో ఏమయిందో తెలియదు.

భర్త ఉన్న స్త్రీ కారణాంతరాలవల్ల మరొకరికి భార్య అయి కాపురం చేస్తూ తను గాఢంగా అభిమానించిన, ప్రేమించిన (అభిమానిస్తున్న, ప్రేమిస్తున్న,) మొదటి భర్తను అనుకోకుండా చూచి, మళ్లీచూచి పొందిన పరిణామం — ఆ కథా విభాగం, నవలా రచనలో—తెలుగు నవలల్లో—క్రొత్తదనమే!

అయితే వర్షం వచ్చిన రాత్రి, మొదటి భర్తను చూడటం, రెండో భర్త రావటం, ఆమె వ్యథ, భీతి మరింత పటిష్టంగా వ్రాసివుంటే గుండెలు పిండి నట్లుండేది పాఠకుడికి. ఇద్దరు భర్తలు — ఆమె — ఆ స్థితిలో — ముగ్గురినీ, ఒకే స్థలంలో, అటు వంటి పరిస్థితిలో, ఒకే సమయంలో, సమావేశ పరచి, రచన సాగించటమంటే రచయితకు అగ్ని పరీక్ష. రచయిత ఆ పరీక్ష ఎదుర్కొన లేదు. తప్పుకొన్నట్టే! అసలు, ఏ సంఘటనలోనూ ఎక్కువ పాత్రలను రచయిత ప్రవేశపెట్టలేదు. ప్రవేశ పెట్టినా రెండు పాత్రల కంటే ఎక్కువ పాత్రలు స్పష్టంగా కనిపించవు.

అనూరాధకు, కృష్ణారావు కూతురుగా తప్ప, ప్రత్యేక వ్యక్తిత్వం నవల సగందాకా ఏర్పడలేదు. ఆమెలో స్వతస్సిద్ధ సుగుణ విజృంభణ కలిగినప్పుడు, అగ్నిశిఖలాగా కనిపించి, అంతలోనే ఆమె మంచు కంటే చల్లగా చప్పగా నీరుగారిపోవటం ఆశా భంగంగా వుంటుంది.

ఆమె విశ్వవిద్యాలయ కళాశాలలో సాంస్కృతి కోత్సవాలలో ప్రేక్షకుల మధ్యలో వుండి, ఒక గమ్మత్తు సంఘటనలో చిక్కుకొని, మరొక పరి స్థితిలో బెనారస్ మెట్రిక్ పరీక్షకు హాజరయి

నట్లు వ్రాయటంవల్ల, పాఠకుడికి ఊహించటం తప్పనిసరి అవుతుంది. చిన్న విషయంలో పాఠకుడు అంతదూరం ఆలోచించాలని రచయిత ఆశించటం న్యాయంగా లేదు.

నవలలో అసంగతాలు అధికంగా వున్నాయి. రంగస్థలం మీద ఏకపాత్రాభినయం చేయవలసిన నటుడు, ప్రేక్షకులలో కనిపించటం — అక్కడే నటించటం — ఆ పద్ధతి ఇతరేతర స్థలాలలో రెండు సార్లు వ్రాయటం — విచిత్రంగా వుంటుంది.

విద్యార్హతలు చూడకుండా ఎవరినీ ఒకేసారి మేజర్‌గా సెలెక్టు చేయరు సైన్యంలో. ఒకవేళ లెఫ్టినెంట్ అయితే కేప్టన్‌గా కాకుండా మేజర్‌గా ప్రమోట్ కాడు. అదీ ఒక్క సంవత్సరంలో జరగదు. కచ్చితంగా ఫలానావ్యక్తి యుద్ధంలో చనిపోయాడని తెలియకపోతే భారత ప్రభుత్వం 'ఆ వ్యక్తి' చనిపోయాడని ప్రకటించదు. చైనీయులకు బందీగా చిక్కి తప్పించుకోవటం తేలిక కాదు. హిమాలయ పర్వతాలలో నిరాహారంగా, నిరాధారంగా, ఎవరూ అన్ని రోజులూ, అంతదూరం ప్రయాణంచేయటం సాధ్యంకాదు. ఇటువంటివి చాలా వున్నాయి.

పై అసంగతాలు ఎందుకు కల్పించవలసి వచ్చిందంటే, బొంబాయిలో కిరీటిరావు చైనీయుల జీవితం చిత్రించే నాటిక అభినయించడానికే! అయితే దాని వల్ల నవలలో సాధించిన ప్రయోజనం మృగ్యం! చిత్రలేఖనం విషయంలో భార్యాభర్తల మనస్తత్వాభినయమే నవలకు ముఖ్యం— ప్రాణం!

కిరీటిరావు అస్వాంలో శోభకోసం అన్వేషించిన తీరులో, వర్షంరాత్రి ఎదురైన వ్యక్తిని గూర్చి ఆనందరావు అడగదగిన విషయం గూర్చి అనూరాధ ఆలోచించిన విధానంలో మనస్తత్వ పరిశీలన వుంది.

ఆనందరావు రెండోపెళ్ళికి సంసిద్ధుడు కావటం, కిరీటిరావు బొంబాయిలో పడిన పాట్లూ జీవితదర్శనతో కూడుకొన్న సమర్థవంత భాగాలు.

భాష విషయంలో రచయితకు జాగ్రత్త వుంది కానీ అధికారం లేదు. కొన్ని పదాల స్వరూప స్వభావాలు స్పష్టంగా తెలియవు. తెలియని పదాలు పరిహరించుకోవటం ఉచితం. చాలా సార్లు ఎదురయ్యే 'యూథాలాభంగా' బాధ కలిగిస్తుంది.

సంక్షిప్తత ఏ సాహిత్యంలో అయినా, ఏ సాహితీ ప్రక్రియలోనైనా, అత్యవసరమే! రచయిత వాక్య రచనలో చూపిన సంక్షిప్తత సంఘటనలలో చూపలేదు. విశ్వవిద్యాలయ కళాశాలలో ప్రారంభమయిన నవల, జీవితంలో— పరిపూర్ణ జీవితంలో ప్రవేశించి, ఒకానొక హృదయ విదారక సంఘటనతో ముగిసి పోతుంది. శోభను అర్ధనగ్నంగా చిత్రించటంతోనే నవలలో పటిష్టత ప్రారంభమవుతుంది. తత్పూర్వ నవలాభాగం కాలక్షేపంగా మాత్రమే సాగుతుంది.

విరిగిన కలలు — ఈ పేరు కథకు ఎంత వరకు అతుకుతుందో, అర్థం ఏమిటో పాఠకులే చదివి వూహించుకోవచ్చు. —రవి.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna
The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1
Editor : S. Sambhu Prasad.

